శ్రీ

# పారిజాతాపహరణము.

ఇది

గయోపాఖ్యానము, సీతాకల్యాణము, ద్రౌపదీపరిణయము

మొదలగు నాటకములను రచియించిన


చిలకమర్తి లక్ష్మీనరసింహముగారిచే


రచియింపఁబడినది






అయిదవ కూర్పు 2000.





కాకినాడ.

కోటమర్తి చినరఘుపతిరావుగారిచే

కాకినాడ ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడి

మట్టే సుబ్బారావుచే

ప్రకటింపఁబడియె.

1923.





వెల రు 0—8—0

## ఈనాటకమునందువచ్చుపాత్రములు.



### పురుషులు.



శ్రీకృష్ణుఁడు—కథానాయకుఁడు.

కైరవుఁడు—విదూషకుఁడు.

నారదుఁడు—దేవముని.

ఇంద్రుఁడు—దేవరాజు.

బృహస్పతి—దేవగురువు.

యముఁడు—దక్షిణదిక్పాలకుఁడు.

విజయదత్తుఁడు—మృతినొందిన కాంభోజరాజు

నారాయణశర్మ—మృతినొందిన యొకబ్రాహ్మణుఁడు.

చిత్రగ్రీవుఁడు—నందనవనపాలకుఁడు.

చిత్రరథుఁడు—గంధర్వుఁడు.

### స్త్రీలు.

రుక్మిణి—కృష్ణుని పట్టపుదేవి.

హంసపదిక—రుక్మిణి చెలికత్తె.

సత్యభామ—కృష్ణుని రెండవభార్య.

రమణిక } సత్యభామ చెలికత్తెలు.
భ్రమరిక }

రంభ—స్వర్గవేశ్య.

శ్రీ

# పారిజాతాపహరణము.

## ప్రథమాంకము.



ప్రవేశము—ద్వారకానగరములోని శ్రీకృష్ణుని యుపవనము.

[కైరవుఁడను శ్రీకృష్ణుని వేడుకచెలికాఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కైర—(తనలో) అహాహా! ఈశ్రీకృష్ణుని సమయస్ఫూర్తియు సాహసమును మెచ్చదగియున్నయవి. కడచిన సాయంకాలమునతఁడు ప్రియసఖుఁడనైన నన్నుం జేరఁ బిలిచి "కైరవా! నే నొకానొక కార్యాంతరమున నొకచోటికిఁబోవలసియున్నది. అప్పటికి మన మిద్దఱమునుం గలసిపోవుదము. కావున జామురాత్రి యగునప్పటికి నీవు వచ్చి నాకొఱకీయుద్యానవనమున నిరీక్షించునది" అని యానతిచ్చి మఱల నాకతఁ డగపడఁడయ్యె. ఇందునకేమికారణము? మందమతినైన నేనతఁడు రమ్మనినవేళకు రాకపోవుటచేతఁ గొంతసేపు నాకొఱకిందు వేచియుండి యెట్టకేలకుఁ గార్యభంగమగునని విసిగి తన పనిమీఁదఁ బోయియుండును. (ఆలోచించి) ఇతం డెం దరిగియుండును? ఎందరిగె నననేల? సత్యభామపై నతనికిఁ గల యనురాగాతిశయముం బట్టి చూడ రుక్మిణీదేవిని వంచించి యతఁడాదేవి యంతఃపురమున కరిగియుండునని తోఁచుచున్నది. ఈమహానుభావున కింతకన్న నాసహాయము కావలసిన పను లేవియుండును? నే నెంతసేపని యిందుం గనిపెట్టుకొనియుందును? అయినను నిప్పు డెంత ప్రొద్దున్నదో చూతము (ఆకసముఁ జూచి) అయ్యో! ఎంతమూర్ఖుఁడను? ఇపు డెంతో ప్రొద్దున్నదనుకొంటిని. తెల్లవారవచ్చినది. అదిగో:—

చ. కలకలవేఁగుచున్నయది; కమ్మఁగ నీచెఁ బ్రభాతవాయువు
ల్గొలకొలలేచి కూసెను శకుంతతతుల్, జలజారిబింబము
వ్వెలవెలఁ బోవుచున్నయది, వేగ దినోదయసూచకంబుగా
వెలపడె నింగిఁ దూర్పుదెస నల్లవె రేఖలు చిత్రవైఖరిన్. 1

మరణమునకు సిద్ధముగనున్న మనుష్యచైతన్యమువలెనె యీవెన్నెలయుఁ గ్రమక్రమముగ నదృశ్యమగుచున్నది. రాజ్యభ్రష్టుఁడయి పరభూములఁ దలదాఁచుకొనఁబోవు రాజువలె నీచంద్రుఁడు కళావిహీనుఁడై యపరాంబుధికిఁ బోయెడును. ఈకృష్ణుఁడు

తెల్లవారునప్పటికయిన, రాదా? ఈప్రజాగరణముచేత నాకన్నులు త్రాగినవాని నేత్రము లట్లు మూతలు పడుచున్నవి. కావున నీబండి గురివెందచెట్టుక్రింద నొకింతసే పుగూర్చుండెదను. (అట్లుచేసి కునికిపాట్లు పడుచున్నాఁడు.)

(తెరలో) రుక్మిణీ! నీనాథుఁడిందు లేఁడమ్మా. కానిమ్మచ్చట నెవరో కూర్చున్నట్లు తోఁచుచున్నది. వారి నడిగివచ్చెదనుండుము.

[రుక్మిణి చెలికత్తెయగు హంసపదిక ప్రవేశించుచున్నది.]

కైర—ఆవచ్చెడువా రెవరో? వాసుదేవుఁడు కాఁడుగద? ఊఁ; ఎవరయిన నాకేమి?

హంస—(తనలో) రుక్మిణీవంచకుఁడగు వాసుదేవునిజాడ నెవరినడిగి తెలిసికొందును? ఇదిగో ఈచెట్టుమొదట నెవ్వరో కనఁబడుచున్నాడు. (పరికించిచూచి) ఓహో! శ్రీకృష్ణుని వేడుకచెలికాఁడును, బ్రహ్మచారియుఁ గల్లలకుఁ బుట్టినిల్లు నగు కైరవుఁ డిందుఁ గొండ్రముచ్చువలెఁ గూర్చుండి కునికిపాట్లు పడుచున్నాఁడు. వీని నెట్లయిన నిచ్చకఁపుమాటల మెప్పించి నేను హంసపదిక నని యితనికిఁ దెలియకుండ మెలఁగి కృష్ణునిరహస్య మెఱింగెదను.

కైర—(తనలో) అడుగులచప్పుడాయమహానుభావునిదె కాఁబోలును. (వినుట నభినయించి) కాదు. కాదు. అందెలచప్పుడగుచున్నది. స్త్రీవలె నున్నది. ఎవతైననేమి? నాకన్నులు మూఁతలు విడుటలేదు. నేనుం జూడఁజాలను. (కునికిపాట్లు పడుచున్నాఁడు.)

హంస—(సమీపించి) అయ్యా! కైరవా! ఇచ్చట కూర్చుండి కునికిపాట్లుపడుచున్నావేమి?

కైర—(తనలో) హాయిగా నన్ను నిద్రపోవనీయక లేపవచ్చిన యీపాపాచి యెవ్వరు చెపుమా? కంఠధ్వనిఁ బోల్చిచూడ సత్యభామచెలికత్తె యగు కనకలతవలె నున్నది. (ప్రకాశముగా) ఓసీ! కనకలతా! ఈప్రభాతమున నీ విందేలవచ్చితివే?

హంస—(తనలో) నన్నితఁడు కనకలతగా భావించుచున్నాఁడు; కృష్ణుని రహస్యములు వీనినోటఁ బేర్లించుట కిదియె మంచిసమయము (ప్రకాశముగా) అయ్యా! మీప్రియమిత్రుని సందర్శనార్థమై యిందువచ్చితిని.

కైర—ఏమే? నీటక్కరితనము. వాసుదేవుఁడు సత్యభామాంతఃపురమునఁ బవ్వళించియుండఁగా నీ వాతని నిమిత్తమిక్కడికి వచ్చితిన నెదవేమి?

హంస—(తనలో) ఈతఁడు తనమిత్రుని గుట్టు వెళ్ళబెట్టినాఁడు. ఈతనినోటనుండి యింకనుగొన్నిమాటలు పలికించెదను. (ప్రకాశముగా) అయ్యా! నేనుపరిషాస్వార్థ

మట్లంటిని; వాసుదేవుఁడు మాదేవీమందిరముననే యున్నవాఁడు. కాని నీసహాయము చేతనే యీలాభముకలిగినది. మాదేవి మీకువందనములు చెప్పుమనగా నిట్లువచ్చితిని.

కైర — ఎవరిసహాయమయిన నేమిలే, రుక్మిణిగర్వభంగమైనది. ఆమెచెలికత్తెయగు తొత్తుకూఁతురు హంసపదికకు గట్టిపరాభవమైనదని నేను సంతసించుచున్నాఁడను. ఇంక నీవు పో.

హంస — చిత్తము. (తనలో) శ్రీకృష్ణుఁడు సత్యభామాంతఃపురమునకరుగుటయు నీకపటబ్రహ్మచారికి నామీఁదను రుక్మిణిమీఁదను జాలకోపముండుటయు నెఱింగితిని. నేనిప్పుడేపోయి వైదర్భికీవార్త లెఱింగించెదను. (అనిపోవుచున్నది.)

[అప్పుఁడు శ్రీకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కృష్ణ — (తనలో) నేనులోకావనకార్యపర్యాలోచనంబునకై నిన్నటిరేయి ననన్యవిదితంబులగు వ్యాపారంబులఁ బ్రవర్తిల్లుచుండ నంతఃపురకాంతలును బంధుమిత్రులును నన్నువ్యధాతలంచి యనుమానించుచుందురు. అందు ముఖ్యముగా,

ఉ. ఏనిట వేచియుండ హృదయేశుఁడు నన్నిరహాత్రియుంచి నేఁ
డేనలినాక్షినో గవయునే? నటించును నూర్పుల న్వరి
మ్లానముఖారవిందయయి మానిని రుక్మిణి నన్నుదూఱుచు
న్దానతిమాత్రకోపనయున న్నిశఁబుచ్చెఁగఁబోలు నెట్టులో !

నామదనసామ్రాజ్యమంత్రి యగుకైరవుఁ డెందున్నవాఁడో? రుక్మిణీప్రముఖకాంత లెట్టులంగున నుత్తలపడుచుందురో వీనిముఖంబునఁ దెలియవచ్చును. అదిగో (చూచి) అచెట్టుక్రిందను గూర్చున్నవాఁడు. నేనిందు వీనిని నిరీక్షించియుండుమనుటచే నేనరిగిన సంగతియెఱుంగక యింకను నారాకకై యెదురుచూచుచు నీచెట్టుక్రిందనే యితఁడు కూర్చుండియున్నవాఁడు కాఁబోలును! (సమీపించి వీఁపు చెయ్యివైచి) ఓనిద్రాదేవీ ప్రియకుమారక! ఓకుంభకర్ణానుజ! లేలెమ్ము.

కైర — (కన్నులు విప్పకయె) అబ్బా! చంపుచుంటివి. ఎవరునీవు!

కృష్ణ — నేను నీప్రియమిత్రుఁడనోయి మాధవ్యుఁడా! లెమ్ము!

కైర — ఓహో! దయచేసినారు? (కన్నులునలుపుకొనుచు) నామాటయిప్పటికైన జ్ఞప్తికివచ్చినదే. మీకెప్పుడే జామురాత్రి యయినదికాఁబోలును! నీవిప్పుడెవత్తువో యింకనెవత్తువో యని నీనిమిత్తము వేచివేచి తుదకుఁ బ్రాణముపిసిగి యీచెట్టుక్రిందఁ జతికిలఁబడితిని.

కృష్ణ — నీవు తడవు నుసలుటచేఁ గార్యభంగమగునని నేను త్వరపడవలసెఁ

గావున క్షమియింపుము. కాని, మిత్రుఁడా! లోకరక్షణభారము పైనిడుకొన్న జీవయాత్ర దుఃఖభాజనముగదా!

కైర—ఇట్లనుటచే నీవు లోకవ్యవహారపర్యాలోచనపరుఁడవై రాత్రి జరముచేసితి నని చెప్పుదువా యేమి?

కృ—అందుకు సందేహమేమి?

కైర—అంతయు సందేహమె. నీమాటలు నమ్మువా రెవరు? నీమేనిజవళిం నీనడకల తడఁబాటును, నీకన్నులయెఱ్ఱఁదనమునుఁ జూచిన వారందఱు నిన్నన భావింపకమానరు. సత్యభామాదేవిని మెప్పించుటకై నీ వరిగియుందువు. మఱి వ్యాపారమైన నింతరహస్య మెందుకు!

కృ—నీవే యిట్లనుమానపడిన వేలలగు రుక్మిణి మొదలగువారల జెప్పనేల? నీ కనుమానమున్న భయములేదుగాని నీమనమున నున్న యీదురభి మును వెల్లడిచేయలేదు గద?

కైర—(తెల్లఁబోయి) అయ్యో! నేనాబండిగురివెంద చెట్టుక్రిందఁ గూరుఁ కునికిపాట్లుపడుచుండఁగాఁ నెవరోవచ్చినన్నుఁ బలుకరించిరి. ఆవచ్చినది సత్యభా దేవి చెలికత్తెయగు కనకలతయనుకొని నేను గన్నులు తెఱవకయె దానితో నేనే యంటిని. అదియును రెండుమూఁడుమాటలాడి తొలఁగిపోయెను. ఇందువలనఁ బ్ర మెద్దియు లేదుగద!

కృ—అయ్యయ్యో! మూర్ఖుఁడా! ఎంతపనిజేసితివి? నీకడకువచ్చినది లత కాదు. అదికొన్నిదినములనుండి యిచ్చటలేనేలేదు. నీవద్దకువచ్చినది రుక్మిణిచె యగుహంసపదిక యయియుండును. రుక్మిణి తనచెలికత్తెవలన నీమాటలువిని నలుకఁబూనును. నీవు నన్ను నిష్కారణముగ దేవికి నాగ్రహపాత్రునిఁ జేసితివి.

కైర—అయ్యో! నేను సహజముగ మందమతిని. అందుపై నిద్రలేమిచే న మతియుఁజెడెను, దానికిఁ దోడు కునికిపాట్లుపడుచు నోటికివచ్చినట్లు ప్రేలితిని.

కృ—ప్రేలినఁ బ్రేలితివిగాని ప్రమాదకరమైన సంభాషణ మేమియును లేదుగద?

కైర—లేదయ్యా! ఏమాటయుఁ జెప్పలేదు. ఏమో? నాకు జ్ఞాపక సుమా? అయిన నట్లు చెప్పానునా? ఎమో? చెప్పనువచ్చును. ఎవరితో నెట్లుమాట వలయునో నాకుఁ దెలియదా? ఏమో? తెలియదేమో? ఊఁ. తెలిసియెయంటినే ఏమయిననేమి నాకు జ్ఞాపకము లేదు.

కృష్ణ—అట్లయిన నిప్పుడేమి చేయుదము? మన మిప్పు డామె సన్నిధి కరిగి తెంగింతమా?

కైర—స్త్రీలమనసులు సహజముగఁ బురుషులను శంకింపుచుండును. ఇప్పుడు నిజస్థితిని వక్కాణించినను మన మిద్దఱముం గలసి తనను వంచించినార మని ంగాని రుక్మిణీదేవి మనమాటలు నమ్మదు. ఇంతకు నొకరి ననంబనియేమున్నది? ములు మంచివికావు.

కృష్ణ—అవును—

తే. గీ. సతులమనము లద్దము లట్లు స్వచ్ఛములయి
యెదుటఁబడువాని వడిగ గ్రహింపుచుండు
నేదఁ దనుపూన ముదయించె నేని మఱలఁ
గలకఁదేర్చుట మిక్కిలి కఠినతరము. 3

యవివేకమువలన మనోవైకల్యంబు నొందియుండు దేవిని మన మిరువురముం రాలిం జేసికొందుముగమ్మ. అదిగో భగవానుఁడైన సూర్యుఁ డుదయించు ఁడు.

కైర—అదిగో భగవానుఁడైనచంద్రుఁ డస్తమించుచున్నవాఁడు. ఈసూర్య బిములు కాలపురుషుఁ డనువర్తకునిచేతి తక్కెడసిబ్బె లట్లున్నయవి.

కృష్ణ—అవును.

వనజహితుండుతోఁచియు తెప్రాకెఁడు మీఁదికి నాకసంబుపై
వనజవిరోధి తా నపరవారిధిఁ జేరగఁ బారుచుండెను
న్మనకొని మీటఁద్రొక్కుతరి ముందరిభాగము మీఁదికేగిన
న్వెనుకటిప్రక్క క్రిందకును వేగమె పోయెడు లీలఁ గైరవా! 4

మరమ్మ.

(అని నిష్క్రమించుచున్నారు.)

[రుక్మిణియు హంసపదికయుఁ బ్రవేశించుచున్నారు.]

రుక్మి—ఓసీ! హంసపదికా! కైరవునివచనములయందు మనము విశ్వాసముంచ ? ఇయ్యది నిజమగునేని యీసత్యభామావిధేయునిచేత నేను నిష్కారణముగ డినదాన నగుదును.

హంస—అమ్మా! బహుకాంతావల్లభులఁ జెట్టఁబట్టినవారల యవస్థలిట్టివే. విచా లములేదు. కావున నీవీ చంద్రకాంత వేదికపైఁ గూరుచుండుము. నేనొంటుక కను నరసివచ్చెదను.

[రుక్మిణి కూర్చున్నది. అప్పుడు కృష్ణకైరవులు ప్రవేశించుచున్నారు.]

కృష్ణ—అదిగో! విదర్భరాజనందన విమనస్కయై కూరుచున్నది.

చ. ఈమదిరాక్షి యల్క నిపు డేమిట దవ్వుగఁ దోలువాఁడ నే
నీమె మొగంబుకోపమున నెఱ్ఱదనంబునుఁదాల్చి యొప్పు కెం
దామరపువ్వులాగు పతిధార్త్య మెదం దలపోసి పార్క నీ
భామను నమ్మిక ల్మోదముభంగి నివే జరింపఁ గావలెఁ. 5

మిత్రుఁడా కైరవుఁడా! నాకంటె నీవు ముందా మెకడకరిగి భవచ్ఛతుత్కారవచో విశేషంబులచే నీపాటలగంధి కోపముఁ జల్లార్పుము.

కైర—సరి. సరి. ఇది నాపాలఁబడినది? ఆమె తనకోప మంతయును నాపైఁ జూపును. (పోయి రుక్మిణియెదుట నిలుచును.)

రుక్మి—(చూచి) ఓహో! ఎవరు మీరు? కైరవుఁడా! నీవు వేడుకచెలికాడగు నాగోపాలదేవుం డెచ్చట?

హంస—ఈయన వెనుక నే యాయనయును నుండును.

కైర—(తనలో) ఈమె న న్నెవిషయమడిగిన 'నేమో' యని పల్కెదను. కానిచో నోరుజారి యేపొరపాటుమాట వచ్చునో?

రుక్మి—ఊరకుండెదవేల? నీమిత్రుని రక్షించుటకుపాయమును వెదకుచుంటివా?

కైర—ఏమొ నే నెఱుఁగను.

రుక్మి—ఆవాసుదేవుని సమాచారము నీవెఱుఁగవు. సరే నీవెచ్చటనుండివచ్చితివి?

కైర—ఏమొ నే నెఱుఁగను.

రుక్మి—బ్రహ్మచారీ! నీవెచ్చటనుండివచ్చినదియు నీవెఱుఁగవా?

కైర—అయ్యో! నావిషయమైయూ మీరడిగినది? నేనిచ్చటనే యుంటిని.

రుక్మి—ఇప్పు డిచ్చటనేయున్నావు. ఈవఱదనుక నెచ్చటనుంటివి?

కైర—ఇచ్చటనె యున్నాఁడను.

రుక్మి—(నవ్వుచు) నీకుఁ బిశాచముపట్టినదాయేమి? అసంబద్ధములు పల్కెదవు.

కైర—నేనె బ్రాహ్మణపిశాచమునై యందఱను బీడించెదను. నన్నుఁ బీడించువా రెవరు?

రుక్మి—(నవ్వుచు) ఏమి నీహాస్యప్రసంగములు? (తనలో) ఈవిప్రకుమారుఁడు నాకోపము సగముచల్లార్చెను. అందుచేతనే భర్త ముందుగా నితనిని నాసమక్షమున కంపెను.

హంస—ఈకపటబ్రహ్మచారి వృత్తియే యదిగద!

(కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

కృ—అకటా. ఈకైరవునిచమత్కారవచన రచనలచే నీమందయాన డెందంబున నాగ్రహంబువాసి మందహాసముచేయుచున్నది. మఱల నాచర్యలఁదలఁచి యీయంచయాన కోపించుటకు మున్న నేను తదీయసమక్షమున కరిగెదను. కైరవుఁడు మంచి సమయము కల్పించెను. (రుక్మిణిని సమీపించుట.)

కైర—(తనలో) అదిగో! నామిత్రుఁడువచ్చుచున్నాఁడు. ఈమెయేమనునో?

హంస—(చూచి రుక్మిణితో) అల్లదిగో! స్వామివారు సాక్షాత్తు సోలుచు దయచేయుచున్నారు. (కృష్ణునితో) ఈమె రుక్మిణీదేవి. విదర్భరాజనందన. దేవరకు భార్య యని లోకులు చెప్పుకొందురు. జ్ఞాపకమున్నదా?

కైర—(మెల్లఁగా) ఓసీ! ఆమెకు లేనికోపము నీకెక్కడనుండివచ్చినదే?

రుక్మి—(పీఠమునుండిలేచి) ఓసీ! ధూర్తురాల! నీయవినయముచాలును. ప్రియావిరహముచేత వ్యథనొందుచున్న యీమనంబునకు మఱింత తాపమేల గలిగించెదవు?

కృ—దేవీ నీవు సత్యము వచించితివి. ప్రియురాలవైన నీవిరహముచేతనే నేను వ్యథనొందుచున్నవాఁడను. నేనట్లున్నను,

సీ. చెలువ నీవదనంబు చిన్నవోవఁగ నేల? కాటుక రేఖలు కరుగ నేల?
యాణిముత్యము లట్లు లశ్రువు లొలుకనేల? చీకాకుపడి కురు ల్చెదర నేల?
మానసం బనయంబు మఱుఁగుచుండఁగ నేల? జడనుగూర్చినపూలు జాఱ నేల?
నవనవాంగకములు నవసిపోవఁగ నేల? బొమ లిట్లు బంకించి ముడువ నేల?
అనపరాధిని నామీఁద నలుగఁదగునె?
చెలువ నీకగ్గు నేను చేసితినయేని
చెఱకు విలుకాని విల్లును విఱిచినట్లె
తేటినారఁ బుటుక్కునఁ ద్రెంపినట్లె. 6

కైర—ఇంతగొప్పయొట్టు పెట్టుకొనినప్పుడు మీరీయన నేమియును ననరాదు.

రుక్మి—ఈసమయమున కేమిగాని చెలియాలు సత్యభామ మీవియోగ మించుకయును సహింపఁజాలదు. కావున మీరింత వేగముగ రాఁదగదు.

కృ—(తెల్లఁబోయి) ఆఁ! సత్యభామా? ఎవరీయసత్యకల్పనముం జేసి నీమెప్పు వడయఁదలఁచినవారు? నే నామెను జూడనైన లేదే.

రుక్మి—ఆమెను గాదు. నన్నుం జూడలేదనిపల్కుఁడు. అట్లయిన కైరవుఁడు హంసపదికతో నబద్ధము చెప్పెనా?

హంస—ఇతఁడు నిశ్చయముగ నాతో నట్లె చెప్పెను.

కైర—అయ్యో! నాప్రాణముమీఁదికి వచ్చినదోయి దైవమా?

కృష్ణు—కైరవా! నేనుసత్యభామామందిర ప్రవేశము సేయనిదెట్లు చెప్పితివి?

కైర—అప్పె—నేనీమెతో నట్లు చెప్పలేదండి.

హంస—ఛీ! ఆబండిగురివెంద చెట్టుక్రింద నాసీనుఁడవై చెప్పలేదా?

కృష్ణు—(తనలో) ఈయవసరమున నీప్రవటుఁ డెట్లుతప్పుకొనునో?

కైర—అట్లయిన నేనప్పుడేమిచేయుచుంటిని?

హంస—నిద్రించుచుఁ గుంభకర్ణునిఁ దిరస్కరించుచుంటివి.

కైర—మఱింకేమి? నిద్రాసక్తుఁ డగువాని ప్రలాపంబులును, జ్వరముచేఁ బీడితుఁ డగువానిపలుకులును, నున్మత్తునివాక్యంబులును, మత్తునస్తువ్రులు భక్షించినవాని వచనంబులును విశ్వసింపఁదగినవి కావు. అందుచేత నామాట లబద్ధములు. ఈయన వెళ్ళనులేదు. నేను జూడనులేదు.

రుక్మి—ఆహాహా! నీవు చమత్కారవచనములచేత నిజ మబద్ధమును, అబద్ధము నిజముఁ జేయఁగలవు. బొంకినను నీవలె నేర్పుగ బొంకవలెను.

హంస—ఈయననుఁజూడ ననత్యదేవతయే యిట్లనుచు చినట్లు నాకుఁ దోఁచుచున్నది.

కృ—ఓవిదర్భ రాజనందనా! ఈవిషయంబున కింతవిచారాక్రాంతస్వాంతవు గానేల? నీకు నిరంతరదాసుఁ డగు నీజనుని నన్యథా బుద్ధిఁ దలంచుట భావ్యమగునా? నాచేసిన యపరాధమునకుఁ గారణములేకపోలేదు.

రుక్మి—అయ్యయో! మీరు నాకుదాసులుకానేల? సత్యభామకుఁ గాకలయును. తదితరసపత్నులకుఁ గావలయు.

కృ—దేవీ! సకలసుగుణరత్నంబులకు గనియగు నీకు దాసుఁడను గావలయును గాని యన్యుల కేల? ఇంక శాంతించి నామనవి యనుగ్రహించి నన్నేలుకొనుము.

(గడ్డముపట్టుకొని బతిమాలుకొనుట)

రుక్మి—(చేయి తీసి వేయుచున్నది)

కృష్ణు—ఓకల్యాణీ! నాపలుకుల నాలకించుక యిందువేని నీవు నన్ననుగ్రహింపకపోవు.

రుక్మి—అనుగ్రహించుటకు ననుగ్రహింపకపోవుటకు నేనెంతదానను?

కృ—సౌంభకుఁ డనురాక్షసేశ్వరుఁడు బదరికాశ్రమ తాపసులకును నితర సాధుజనంబులకును మహాపకారము సేయుచున్నాఁడటఁ! అతనిబారికోడి తపోధను

లందఱు దుష్టశిక్షణం బొనరించి లోకముల ననుగ్రహింపుమని జాబాలియను మునికుమారునిచేత నాకు సందేశ మంపిరి. ఆమునికుమారుఁడును సందేశ మెఱింగించి మునిదత్తములును దానవవిజయసాధనములును నగు దివ్యాస్త్రంబులఁ గొన్నిఁటిని నాకుపదేశింపఁ దలంచి నియమస్థుండవై యేకాంతప్రదేశమునకు వచ్చునదియని నా కానతిచ్చెను. తదాదేశంబున నేనెవరికిఁ దెలియకుండ నరిగి నిన్నటిరేయి దత్కార్యంబు నిర్వర్తించితిని. కైరవుఁడదియెఱుంగక నేను సత్యభామామందిరమునకుఁ బోయియుండునని యూహించి యట్లుసందర్భముగఁ బలికె. ఆపలుకులు హంసపదికముఖంబున విని నీవు నాయందపరాధ మారోపించితివి. ఇంతకన్న నాయొనర్చిన నేరములేదు.

కైర—అమ్మయ్య. ఇప్పుడు నేను బ్రదికితిని. మిత్రుఁడా! ఇది నీవురహస్యము చేయుటచే మంచిపనిచేసితివి. అట్లుగాకది యీ కాంతల కెఱింగించిన నేకాంతము లోకాంతముపర్యంత మీపాటికి వ్యాపించియుండును.

హంస—నే నిప్పుడు కలహకారిణినై యపరాధంబుఁ జేసితిని.

రుక్మి—ఓసీ! నీవు కావు. నేనే ప్రాణేశ్వరునియెడ నవినయమొనర్చితిని.

కృ—దేవీ! నీవు విషాదమొందఁ బనిలేదు. కాంత కలుకఁబూనియు దర్శనీయ యయి యుండునుగదా!

చ. కమలదళాక్షి నీదు తెలిగన్నులఁ గెంపుజనింప నాదు ధా
ర్ష్ట్యమునకు నీసుఁ జెంది చలితాధరవై నరాళమైన క
న్బొమముడిచేత నాకు భయము న్గలిగించుచు నుండియు న్మనో
జ్ఞ మగువిలాసము న్దొలిపి సన్నుతివై కనుపండు వత్తటే. 7

ఇప్పుడు నీవు ప్రసన్నురాలవగుటచే నేను ధన్యుఁడ నైతిని. మఱియు,

తే. గీ. సంజకెంజాయ మెలమెల్ల జాఱుచుండ
స్వచ్ఛమై తోఁచు చంద్రబింబంబుపగిది
నలుక నెడఁబాయు నీవదనారవింద
మమలమై తోఁచు నిప్పు డోయంబుజాక్షి! 8

కైరవా! నీవుపోయి నాయాగమనంబు బలదేవాదుల కెఱింగింపుము.

కైర—చిత్తము. (తనలో) ఇప్పటికీగండము గడచినది బహుకాంతామనోహరుఁడగు వీనిని సేవించుటకంటె వనవాసముత్తమము. [అని నిష్క్రమించుచున్నాఁడు.]

హంస—అమ్మా! నేనునుబోయి యంతఃపుర కాంతల కీశుభవర్తమాన మెఱిఁగించెదను. [అని నిష్క్రమించుచున్నది.]

కృ—(తనలో) ఈయుపవనవీథుల నీమెతో విహరించి యింకనుఁ బ్రసన్న

రాలిఁజేసెద. (ప్రకాశముగా) దేవీ! మనోహరములయిన యీప్రభాతవాయువుల ననుభవింతము రమ్ము.

రుక్మి—చిత్తము. ఈమందమారుతము దేవరవారికిఁ బ్రజాగరణమునఁ బుట్టిన బడలిక నపనయింపఁ గలదు.

కృ—(కొంతదూరము వెళ్ళి) సుందరీ! ఇటు చూడుము.

చ. అడుగున నల్లనై పయికినట్లు గణంబయి దర్శనీయమ
య్యెడు గురివెందగింజఁగను మిందుని భావన దుష్టచిత్తుఁడై
స్వభావున నింద్యమైనతనవర్తనమంతయుఁ గప్పిపుచ్చి క
న్పడుఁ బరిశుద్ధజీవనునిభంగి జగంబును మోసపుచ్చుచున్. 9

రుక్మి—ప్రాణేశ్వరా! దానికన్నఁ జిత్రమిది పుంజీభవించినచీఁకటి యట్లొప్పెడు నీతమాలవృక్షము వీక్షింపుఁడు.

కృ—అది యాకృతిచేత నల్లనయ్యు గుణములచే స్తోత్రపాత్రం బయ్యెడును. చూడుము.

చ. గమనమతావుల న్దెసలఁ గ్రమ్మెడి కస్తురి నల్లనయ్యు, శ్రా
వ్యమధురనాదము ల్దొరయఁ బల్కెడికోయిల నల్లనై, యమూ
ల్యము గద యింద్రనీలమణి: యాకృతిఁ బట్టి గుణాగుణంబుల
న్గ్రమమున నిర్ణయించుట దురాసదమౌఁజుమి యెట్టివారికిన్. 10

(తెరలో)

హంసపదికా! వాసుదేవుం డెందున్నవాఁడు? ఏమనుచున్నావు? రుక్మిణీసహితుండై యిందు విహరించుచున్నవాఁడనియా? సరే.

రుక్మి—ఎవరో వచ్చుచున్నారు [నిరూపించి] సత్యభామచెలియగు రమణిక మీనిమిత్తము తాఁబోలు వచ్చుచున్నది.

[రమణిక ప్రవేశించుచున్నది.]

రమ—[తనలో] సత్యభామసందేశమును రుక్మిణియెదుట శౌరితోఁ జెప్ప వచ్చునా? కూడదా? యని నామనంబు శంకించుచున్నది. అయిననుఁ జెప్పఁగూడనిదిం దేమున్నది? [సమీపించి] దేవా! దేవీ! మీయిరువురకును సుప్రభాతమగుం గాక!

రుక్మి—రమణికా! యిటురమ్ము.

కృ—రమణికా! దేవి సత్యభామ నానిమిత్తమత్యంతము కళవళపడియెఁ గాఁబోలును.

రమ—మల్లెపూ వెండఁ బడినప్పు డది వాడినదా యని వేరె యడుగ నేల?

కృష్ణ—అందుచేత నీవిప్పుడే యరిగి నా రాక నెఱిఁగించి యామెను స్వస్థచిత్తు రాలిం జేయుము.

రమ—జాగరముచే నవసిన మీముఖారవిందముఁ జూడక యామె స్వస్థచిత్తురా లెట్లగును? ఆమె మీతో నిట్లు విన్నవింపుమన్నది. "దేవా! మంగళప్రదమగు మీదర్శన మొసఁగి యక్క రుక్మిణి మలమటఁ బాపినచందమున మాసంతాపమునుఁగూడ నపనయించి సంభావింపఁగలయుదు" అని.

రుక్మి—(తనలో) ఇప్పుడు ప్రాణేశ్వరుఁడు దీనివెంట సత్యభామయింటికి కరుగునా యేమి?

కృష్ణ—(తనలో) ఇప్పుడామె కేమిసందేశమంపుదును? ఏమాటలాడిన నీరుక్మిణి యేమిగా భావించునో? అయిన నిట్లు చెప్పెదను. (ప్రకాశముగా) రమణికా! దేవి సత్యభామతో నాపలుకులుగా నిట్లు పలుకుము. "దేవీ! అవరోధజనంబులనెల్ల నందు ముఖ్యముగ నిన్నును నెప్పుడుచూతునా యని నాచిత్తంబు దత్తరపడుచున్నది. వైరవుని యప్రమాణవచనంబులు నీమనంబును బాధింపకుండుఁ గాక!"

రమ—తన ప్రమాదమువలనఁ బుట్టినకళవళ మంతయుఁ వైగన్నుఁడు మార్గమున నెదురుకొని నాకెఱిఁగించెను.

రుక్మి—అతఁడు మాపాలిఁటికి నేఁ డపరనారదుఁ డయ్యెను.

[తెరలో గానము వినఁబడుచున్నది.]

రమ—ఎచ్చటనో వీణానాదము వినఁబడుచున్నది.

కృష్ణ—(చెవియొగ్గి విని) అది నిశ్చయముగ గానకళావిశారదుఁ డగు నారదుని వీణానాదము. అదిగో! ఆమునీంద్రుఁడు మహతి యను వీణను పాణిని ధరించి లలాట భాగంబున నూర్ధ్వపుండ్రము దిద్ది దండకమండలశోభితుఁడై వల్కలధారియై మత్సమీపమున కేతెంచుచున్నవాఁడు. ఈమహాత్ముఁడు కలహప్రియుఁడు.

రుక్మి—అందుచే నెవరెవరి కెట్టి కలహంబులు నెట్టునో యని నెమ్మనమ్మున సందియము కలుగుచున్నయది.

[పైన చెప్పినట్లు నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నార—(తనలో) సమస్త ప్రపంచంబునఁ గల సురాసురమనుష్యలోకంబులకుఁ గలహంబు లనేక పర్యాయంబులు గల్పించితిని గాని యీయాదవచంద్రుని భార్యలకుం బోరాటంబు మనసారఁ గల్పింపనైతిని. నేనిప్పుడు రుక్మిణీసత్యభామలకును శ్రీకృష్ణ సత్యభామలకును గడపెట్టెద. అందువలన నాచమత్కార మెల్లనుఁ దేటపడఁగలదు.

(కృష్ణుని సమీపించుట.)

కృష్ణు—(రుక్మిణితో లేచి) మహాత్మా! నారదమునీంద్ర! భార్యాసమేతుఁడనై నమస్కరించుచున్నాఁడను. (నమస్కరింతురు.)

నార—ఈప్సితార్థసిద్ధిరస్తు!

కృష్ణు—దేవా! ఆ చంద్రకాంతోపలవేదికపై దయచేయుఁడు.

నార—సందరమునుఁ గూర్చుందము రండు.

[శ్రీకృష్ణుఁడును రుక్మిణియు నారదుఁడును వారివారి పీఠములఁ గూర్చుండిరి.]

రుక్మి—(తనలో) నారదముని యని జను లనుటయె కాని యెన్నఁడుఁ జూచి యెఱుంగను. కొంచెము తడవిందుండి యీమహాత్ముని వచనామృతమును వీనులఁ గ్రోలి ధన్యురాల నయ్యెదను.

కృష్ణు—దేవా!

ఆ. వె. మెఱపులేని వెలుఁగు, మేఘోదయములేని
 వాన, పూవులేని ఫలమునావె
 రాకవోలు నీదు రాక మౌనీశ్వర!
 కనులపండు వయ్యెఁ గలుష హరము. 11.

నార—జగదేకగురూ! భారతీనాథ నాగభూషణ పురందర జాహ్నవీశ్వరప్రముఖ గీర్వాణాధిపులెల్ల నీమహామహిమ మెఱుంగలేక యనంతశ్రమములఁ బొరయుచుండ మాయాస్వరూపుఁడవై, యాదినారాయణుఁడవై, కారణజన్ముఁడవై, సర్గ, స్థితి, ప్రళయ హేతుభూతుఁడ వగు నీవు నన్నిట్లు సంభావింప నేటికి?

సీ. విశ్వపావనమైన వినువాఁక యెవ్వాని యడుగుఁదమ్ములఁ బుట్టి నలరుఁదేనె
 భువనభారముఁ దాల్చు భోగీంద్రుఁ డెవ్వాని పవళించు మెత్తని పట్టుపాన్పు
 అమృతంబు వొడమిన యంబోధి యెవ్వాని రాణివాసము లుండు రాచనగరు
 పరమేష్ఠి యావిర్భవంబున కెవ్వాని పొక్కిలి పొందమ్మి పురిటియిల్లు
 ప్రాభవమునకు నెల్ల నెవ్వాని వరగుణాళి
 వరుసఁ గైవార మొనరించు వందిగణము
 అట్టి నినుఁ గాంచి ధన్యుడనైతి నిప్పు
 డఖిల కళ్యాణ గుణసాంద్ర! యాదవేంద్ర! 12.

మ. ధరణీభారము మాన్పఁగాఁ దలఁచి యాద్యైత్యాధమానీక సం
 హారణంబుం బొనరించు వేడుకను శ్రీమద్దేవకీగర్భ సా
 గరరాకాశశిబింబమూర్తి వయి లోకం బందు జన్మించి యె
 ల్లరదోసంబులు బాపుచుండెదవు లీలామానుషా! మాధవా! 13.

కృ—ఓజగద్వందితకీర్తీ! దేవరవా రెచ్చోటనుండి దయచేసితిరి? మమ్మేకత ము ధన్యులం జేయదలంచితిరి? మహాత్ము లూరక రారే.

నార—దేవా! నిజావతారంబుచే యదుకులంబు ననుగ్రహించిన శ్రీమన్నారాయణుండవగు నిన్నును సకలనారీమండలంబునందును, ముఖ్యముగ నీయంతఃపురకాంతాజనంబునందును సద్గుణగరిష్ఠయును నగ్రగణ్యయు నని పొగడ్తగాంచిన యీవిదర్భరాజనందనం గన్నులకరవుదీర నొకమారు వీక్షించుటకును నీయనఘ జోడునకుం దగియున్న యీదంపతులను నాయొసపిన సపర్యలం దనుపుటకును వచ్చితిని. మున్నే మెనుం గూర్చి వినినదంతయు యథార్థంబయ్యె. మర్త్యాంగనలమాట యేల? దేవతాంగనలైన నీమె కాలిగోరునైనం బోలరు.

రమ—(తనలో నసూయతో) రుక్మిణిని బొగడుట సత్యభామాదుల నిరసించుటయే.

కృ—దేవా! మీవచన ముపచారమాత్రము కాదు. మీరు నిజమునే వక్కాణించితిరి.

రుక్మి—(నమ్రతతో) మీ యిరువురు దయాళుసంబునం బల్కి వెల్లివిరియుచున్నది. కాని నేను మీ పొగడ్తకుం దగను.

నార—దేవా! భగవంతుండవగు నిన్నూరక దర్శింపరాదని యమలోకంబునుండి వచ్చుచు నంతలి పారిజాతసుమం బొకండు తెచ్చితిని. మా బోంట్ట మునులు మిముంబోంట్లకు సమర్పించ నవి పుష్ప, పత్ర, ఫల తోయములు గాక మతియేమున్నవి? (పువ్విచ్చుచున్నాడు.)

కృ—(దోసిలి యొగ్గి పుచ్చుకొని) మహాప్రసాదము. స్వామీ! అమరపుష్పప్రాప్తిచేం గృతార్థుండ నయితిని.

రుక్మి—[తనలో] శచీదేవి ధరింప నర్హమగు నీకుసుమము కొప్పునం దుఱుము కొనంగల్గుట మహాభాగ్యము. దీనిని నా కొసంగుండని ప్రాణేశ్వరుని నడుగుటకు నడుగక పోవుటకుంగూడ మనస్కరింపకున్నది. అయినను దానిని వినియోగించు నేర్పు భర్తయే యెఱుంగును.

రమ—[తనలో] ఈపుష్పమును ధరించుటకు మాసత్యభామకన్న నర్హులేరును లేరు.

కృ—[తనలో]

ఉ. ఈముని పారిజాతసుమ మేటికిం దెచ్చి యొసంగె నాకు? నే
నేమది రాశికిత్తు నిది? యెవ్వరి కిచ్చిన నేమి వచ్చునో?
భామ విదర్భరాజసుతె ప్రక్కనె యున్నది యామె కిచ్చిన
న్గోమలి సత్యభామ కడుం గోపన యల్గక పోదు నాపయిన్. 14

నార—ఏమి! వాసుదేవా! ఏమి యాలోచించుచున్నావు?

కృ—ఈకుసుమసౌరభమున కద్భుతపడుచుంటిని [తనలో] నాయిచ్చవచ్చినట్లు సలుపకుండ నీరమణిక యేలరావలయును? వచ్చినది తత్సమాచారప్రకార మెఱింగించి తత్క్షణమే యేలయరుగదయ్యె. దానిని వెంటనే యనుపకపోవుట నాలోపమే.

రమ—[కృష్ణునితో] దేవా! ఈకుసుమధారణ మనన్యసాధారణమై మాసత్యభామాదేవి తనూవిలాసమునకు మఱింత వన్నెఁదెచ్చును.

రుక్మి—ప్రాణేశ్వరా! రమణిక యన్నట్లు పారిజాతమును జెల్లెలు సత్యభామ కనుపుట యుచితము.

రమ—[తనలో] ఇంకఁ దప్పక యితఁడు దానిని సత్యకే యొసంగును.

కృ—[తనలో] సర్వవిధముల రుక్మిణియె దీనిని ధరింపఁదగినది. విశేషించి యీమె యింతకుమున్న నాపైఁ బూనినయలుకయుఁ దొఱఁగి ప్రసన్నురాలగును. మునియు దీని నన్యథా యోజింపఁడు. కావున దీనిని రుక్మిణి కొసంగుట కర్తవ్యము.

నార—నారాయణా! నీహృదయేశ్వరియు నీసమక్షవర్తినియునగు రుక్మిణీదేవి కీప్రసూన మర్పింపుము.

కృ—చిత్తము. [రుక్మిణితో] దేవీ! సకలవిద్యావిశారదులగు నారదులయనుమతంబునఁ దదర్పిత పారిజాతమును నీకిచ్చెద. గ్రహింపుము.

తే. గీ. గరితలందును నీవగ్రగణ్యురాల
వలరు లందును నిద్ది యగ్రగణ్య
మట్లగుట దీని నీకిచ్చి యన్నమిన్న
యోగ్యమగు దానిఁ గూర్చితి యోగ్యతోడ. 15

[పుష్పమును రుక్మిణికి నిచ్చుచున్నాఁడు.]

రుక్మి—మహాప్రసాదము దేవా! [దోసిలియొగ్గి పుచ్చుకొనుచున్నది.]

రమ—[అసూయతోఁ దనలో] ఈమాధవుఁ డెంత ద్రోహము సల్పినాఁడు. మాసత్యభామకంటె నీవన్నెలాఁడికడ నేమిసద్గుణములున్నవనియితఁడీమెకిది యొసఁగెను

కృ—దేవీ! ఇది నీధమ్మిల్లమున ముడుచుకొనుము. కా దందువు: నేనెముడిచెదను. [అట్లుచేసి చిఱునవ్వుతో నామెమోము చూచుచున్నాఁడు.]

రుక్మి—[శృంగారలజ్జ నభినయించుచు సంతోషముతోఁ దనలో] ఈసమయమున నావేణియందమునుఁ జూచుకొనుటకు రెండునిలువుటద్దములుండిన బాగుండును. అయిననుఁ జూచి యానందింప వలసిన జీవితేశ్వరుఁడు సమక్షమందెయున్నాఁడుగదా!

కృ—[కొప్పుచూచి] అహాహా! మత్తమాతంగయాన! ఏమి నీవిలాసము.

చ. అలికులవేణి నల్లనగు నంబరవీథినిఁ దెల్లమబ్బు తా
నెలకొనియున్నయట్లు హరినీలమణీమయభూషణంబుపైఁ
జెలువగు పుష్యరాగమునుఁ జెక్కినయట్లు నల్లగల్వపై
విలసిలుమంచుబిందు వటువెన్నెలను నీకుసుమంబు కొప్పుపై.

నార—మఱియుఁ బార్వతి తాల్చిన యవతంసచంద్రకళవలె నీమెయిపొదల నీపుష్పంబు రాజిల్లుచు నీకళ్యాణికివర్ణనాదుస్సాధ్యమగు సౌందర్య మొకండుదెచ్చెను.

రుక్మి—దేవా! అసమానవిలాసహేతువగు నీకుసుమంబుమహిమ యెట్టిదియో వినఁగోరెదను.

నార—కళ్యాణి! అడుగఁదగినదాని నడిగితివి. వర్ణించెద నాకర్ణింపుము. యీకుసుమవతంసముఁ దాల్చుసువాసినులకు నిత్యమంగళ సౌభాగ్య వైభవ ప్రాభవాదులు లభించును. ఆయింతి ప్రాణనాథునకు నిరంతరాభ్యుదయంబు సంప్రాప్తించును. ఇది యేభవనంబున నుండునో యాభవనంబు దేవేంద్రమందిరంబు చందంబున సిరుల కిరవగుచు మెఱయుచుండును. దీనియమితసుగంధంబు శతయోజనవ్యాప్తము. మఱియు,

తే. గీ. చందనమె హెచ్చు సకలభూజములలోన
దానికన్నను హెచ్చు సంతానకుజము
దానికిని హెచ్చు కల్పమందారతరులు
పారిజాత మిన్నిటికె హెచ్చుఁ బద్మగంధి.

కృ—ఆహాహా! భూలోకపుష్పములకు నమరలోకకుసుమంబులకు నెంతో భేదమున్నది! సురమహీజాతజాలంబయి యత్యధిక విఖ్యాతంబగు పారిజాతంబు మీరు మాకొసంగుటచే మే మిద్దఱమును ధన్యులమైతిమి. మాదేహగేహంబులు పావనము లయ్యెను.

రమ—(తనలో) మాసత్యభామకడ కరిగినపుడీపావన మగపడును.

రుక్మి—దీనిమహిమ యెంత వినినను దనివి తీఱకున్నయది.

నార—మఱియు నీపుష్పంబు ధరియించువారికి నాకలిదప్పియుఁ బాధమ యుండుటఁజేసి యన్నపానంబులపై మనసు చనదు.

ఉ. ప్రాణపదంబు సుమ్మి యిది పద్మదళాక్షికి, మానవులందు నిం
ద్రాణికి సెజ్జగార్చెదరు దైవతకాంతలు దీనితోడ నా
ద్రాణియుఁ దీనిఁ దాల్చు నవతంసముగా ననయంబు, సర్వగీ
ర్వాణవిభూషణం బిదియె పంకరుహాయతచారులోచనా!.

రుక్మి—దీని పరిమళమిట్లెంత కాలముండును?

కృ—అమరలోక పుష్పమగుటచేత దీనిపరిమళము శాశ్వతమని తలఁచెదను.

నా—అట్లు గాదు. వినుఁడు.

చ. కినుక జగంబు నేఁచుచును గాడ్పులు వేసవియందు వీచిన
న్నఖరదుర చంద్రికానిశల సౌఖ్యము లీల మెయి న్విహారమున్
త్నఅపిన లేశము న్నలుగ నేరదు వాఁడదు యిట్టులొక్క వ
త్సర మగునాఁకనుండునఁట తావులు తగ్గుచునుండుఁ బిమ్మటన్.

రుక్మి—ఇంతజగదేకవిచిత్రచరిత్రగలపుష్పంబు నా కొసఁగుటచే నన్నుఁగాంతా జనంబున నధిక గౌరవాస్పదముగ నొనర్చితిరి. ఇది నాకును నాసపత్నులకుఁ గలహ కారణ మగునేమోయని యించుక శంకించెదను.

రమ—(తనలో అసూయతో) నీకుఁ గల్గిన మహదైశ్వర్యమున కోర్వలేక కల హించువా రెవరు? ఇది సత్యభామ కిచ్చినను వద్దు.

కృ—సపత్నులయందొక్కరితె కనన్యసుదుర్లభమగు గౌరవము లభించినఁ దక్కిన వారికి మనంబెరియుట స్త్రీ జనంబులకు సామాన్యమే. అయినను నిది యంత కలహ కారణముగఁ దలఁపను.

నార—వాసుదేవా! నీవనినట్టిది కలహంబునకు విషయంబు కాదు. ఒకవేళ నట్లయినను మాత్రము మనమేమి చేయఁగలము? చక్రవాకము విలపించునని భగవానుఁడు చంద్రుఁడు జగంబులకు వెన్నెలఁ బ్రసాదింపకుండునా? ఈమెకిట్టి యసమానగౌరవము లభించుటచేత నీ సొసవతులలోఁ గొంద ఱోర్వలేనివా రుట నిజమే. అందుముఖ్యముగ సత్యభామ.

కృ—ఒకరిని నిరూపింపనేల? అందఱు నభిమానవతులే.

నార—అందుసత్యభామ యూగ్రస్వభావురాలు. ఆమె జగత్త్రయంబునఁ గల కాంతలలోఁ దానె చక్కఁదనంబున కెక్కుడనియు సద్గుణంబులకు తాననియు నభిమానంబునకుఁ గాణాచియనియుఁ భావించుకొని యనలేనిగర్వమున విఱ్ఱవీఁగుచుండును. ఆమెకాదినుండియుఁ నిట్టి యభిప్రాయమెకలదు.

కృ—(తనలో) ఈనారదుఁడు కలహప్రియుఁడై రుక్మిణి మెప్పుఁబడయఁ గోరి తన యిచ్చకపు మాటలచే సత్యభామ నధిక్షేపించుచున్నాఁడు. ఈరమణికి యోపలుకు లాసాత్రాజితితోఁ దెలుపకుండునా? (ప్రకాశముగా) మునీంద్రా! మీరు చక్కఁగ విమర్శింపలేదు. ఆమె కంతగర్వ మున్నట్లు నాకుఁ దోఁచదు.

నార—(కోపముతో) లేకేమి? ఆసత్రాజిత్పుత్రిక పైఁగలపక్షపాతముచే నీవిట్లు

వచించెదవు కాని యామె నెఱింగినవా రందఱును నాపలికిన గంతయు యథార్థ మని తోఁచకమానదు.

రుక్మి—అవును. ఆసుందరియందు గోవిందున కతిపక్షపాతము.

రమ—ఓకాంతా ! అంతటి పక్షపాతమున్నచో పారిజాతం బానాతి కే యొసఁగుఁగాని నీకేల యిచ్చును? ఆమె పనోక్షమున నిష్కారణముగ నామెను నిందింపనేల ?

నార—ఓహో ! చెలికత్తెవగుటచేత నా వూసికొనివచ్చితివి ? ఏభార్యయత్యధిక వినయవిధేయతా సౌభాగ్య సౌందర్యంబులలో నగ్రగణ్యురాలో యామె కాకుసుమమీ పురుషోత్తముఁ డిచ్చెను. సత్యభామను నీవె గాని నేనెఱుంగనా ? తాను మహాప్రోషనని ప్రాణనాథుని సుయితము నిర్లక్ష్యము సేయును. ఈరుక్మిణీదేవి సద్గుణంబులు, తెలివి,వినయము, సౌజన్యము, గురుపూజ, పతిభక్తి, బంధుప్రేమము, దైవభక్తి, కృతజ్ఞత, యౌదార్యము మొదలగు సద్గుణమాణిక్య నికరంబు లామె సపత్నులకును నందు ముఖ్యముగ సత్యభామకు వేయేండ్లు తలక్రిందుగఁ దపమొనర్చిన నలవడునా ? ఈమె యెక్కడ వా రెక్కడ? సూర్యమండలమునకును మిణుఁగురు పుర్వులకును గల భేదము గలదు.

రుక్మి—దేవరవా రతిశ్లాఘింపుచున్నారు.

కృ—మునీంద్రా ! స్త్రీలపరిసంస యేటికి ? చాలింపుము.

నార—గుణాగుణ నిర్ణయము నిష్పక్షపాత చేతస్కుల మగు మముఁబోటి తపోధనులె చేయవలయు. ఆసత్యభామ సౌకర్యలేమికిఁ దోడీరుక్మిణీదేవి కన్నియు లాభములె కలుగుచున్నవి. ఎవరికుసూయ వారినె చెఱచును. తా నెంతపరుపించినను దన కీమె మహిమము గోరంతయుఁ గలుగదు. తా నెన్నివన్నెలు తెచ్చుకొన్నను జక్కఁదనంబున రుక్మిణికిం దీటురాదు భర్తపై నెంత ప్రభుత వడసినను పట్టమహిషి యని తా ననిపించుకొననేరదు. ఆమె విషయమై యింత వృథాప్రసంగ మేల యందువేని నీ పత్నికిని కలహకారణ మనుమాట వచ్చెఁగాన మేచుంచిమార్గము ప్రశంసింపవలసె. ఓకళ్యాణీ !

రుక్మి—దేవా ! ఆజ్ఞాపింపుఁడు.

నార—ఉ. నీసరిసపత్నులందఱును సిగ్గని నిత్యము నోర్వలేమిచే
గాసిలుచుండఁగాఁ దొలుతకంటె మహావిభవంబు లందుచు
న్భాసుర సౌఖ్యము ల్వడసి భర్తను దైవముగాఁ దలంపు మీ
యేసరి కైన నోర్వని పృగేక్షణలే చెడిపోదు రస్వరణ.

రుక్మి—దేవర యాశీర్వచన మప్రతిహతమగుంగాక !

కృ—అన్యథా యెన్నఁడును గాదు. దేవఋషి పుంగవుఁడు గదా !

నార—దేవా! అధోక్షజా! ఇంక నేఁ బాతాళలోకంబున కరిగి యచ్చట వైచిత్ర్యంబులఁ గని మరలివచ్చెదను. నాకనుజ్ఞ యొసంగుము.

కృష్ణు—(లేచి) దేవా! చిత్తము. అనుగ్రహించుచుండుఁడు.

నారద—(తనలో) తలఁచినకార్యమైనది కలహవృక్షమునకు విత్తనము నాటితిని. ఆచిరకాలమున వీరు దానిఫల మనుభవింతురు గాక! (అని నిష్క్రమించెను.)

రమ—దేవా! నేనును సెలవుఁ గైకొనియెదను.

కృష్ణు—రమణికా! నీవు కోసినసంపంగిపువ్వుల నిచ్చట మఱచితివి. (వానిఁ బుచ్చుకొని రమణికను దగ్గఱ రహస్యముగ) ఆ నారదమౌని కలహసూచక వాక్యంబులును పారిజాతంబు రుక్మిణి కొసఁగుటయు నీ వా సత్యభామకు నెఱిఁగింపక యిచ్చటనే మఱచిపొమ్ము. కానిచో మిగుల మోసంబు వాటిల్లును.

రమ—స్వామీ! భార్య నన్యుఁడు పరిభవింపుచుండెను గద యని యభిమానమైన లేక యూరకుండి యిప్పు డామెతోఁ జెప్పవల దన నేల? సత్యభామ కోపించిన నేమి? రుక్మిణి యనుగ్రహమున్నఁ జాలదా? ఆమె కీపువ్వులు మాత్ర మెందుకు? (అని నిష్క్రమించును.)

కృ—(తనలో) అయ్యో! ఈ నారదుఁ డెందుల కరిగిన నందుఁ గలహోదయమే కదా! నే నిప్పుడు నిశ్చయముగా సత్యభామయెడ నపరాధినైతిని. (రుక్మిణి యొద్దకు వచ్చుచున్నాఁడు.)

రుక్మి—(తనలో) ప్రాణేశ్వరుఁడు రమణికను సాగనంపు నెపమున సత్యభామకు వినయపూర్వక మగు సందేశ మంపఁ బోవును.

కృ—(తనలో)

చ. తెలుపక పోదు నారదుని తీవ్రపుఁ బల్కులు చేటి సత్యతోఁ
జలమున దండతాడితభుజంగివిధంబున నాలతాంగి బి
ట్టలుగక పోదు నా యవినయంబునకు న్మఱి తూలుమాటకు
న్గలఁగక పోదు ప్రేయసికి నాకును నెయ్యపుఁ గయ్య మియ్యెడన్. 21

దేవీ! మందిరమున కరుగుదము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమించుచున్నారు.)

శ్రీ

# పారిజాతాపహరణము.

## ద్వితీయాంకము.



ప్రదేశము—సత్యభామా మందిరము

[సత్యభామయు, భ్రమరికయుఁ బ్రవేశించుచున్నారు.]

సత్య—ఓసీ! భ్రమరికా! రమణిక యింతతడవు రాకుండుటకుఁ గారణ మేమని నీ వూహించెదవు?

భ్రమ—దేవీ! మన రమణికను మీరు భర్తయొద్దకుఁ బంపిన యొక్క ముహూర్తమునకె మహానుభావుఁడగు నారదమునీంద్రుఁ డాయనను సందర్శింప రుక్మిణీ మందిరంబున కరిగెనని కంచుకి గోపకుఁడు నాతోఁ జెప్పెను. ప్రభావముచేత మాత్రమే యిదివఱ కెఱుంగఁబడిన యాదేవర్షిని విలోకింపుచుఁ జమత్కారగర్భంబులగు నతని పల్కుల నాలకింపుచు మన రమణిక యచ్చోటు విడిచి రామనసురాక యిట్లు మసలెనని నాకుఁ దోచుచున్నయది.

సత్య—అయ్యో! కలహమె పురుషార్థముగఁ దలపోయు నాజడదారి భర్తగారిని దర్శింపవచ్చె నని వినుటతోడనె నామనంబు పరిపరివిధంబుల శంకింపుచున్నది. భర్త రుక్మిణీమందిరంబున నుండుటయుఁ గలహభోజనుం డాసెలవునకుఁ బోవుటయు నారమణిక జాగు చేయుటయుఁ జక్కఁగ విమర్శించిచూడ నాకు భయమగుచున్నయది.

భ్రమ—అమ్మా! నీవింత శంకింపవలసినపని లేదు. శిష్టజనపరిపాలకుఁడగు దేవకీనందనునిఁ గనుఁగొనఁ బలువురు వచ్చుచుందురు, పోవుచుందురు. అట్టివారిలో నారదుని రాకకై నీకింతభయ మేల కలగవలయును? అది యటుండ మీదంపతుల యన్యోన్యానురాగము సందేశ మగువిషయము కాదు.

సత్య—అట్లయినఁ బ్రాణేశ్వరుఁడు నాసందేశము కబహుమానముగ నాలకించువాఁడు దర్శనమిచ్చి నన్ను సన్మానించు నని యే నీవు తలంచెదవా?

భ్రమ—నిశ్చయముగ నట్లే తలంచెదను. ఎప్పటికప్పుడే మఱచెదవు గాని నీవు మాత్రము మామాట యెఱుంగవా? వాసుదేవుఁడే యింద్రువదనమదిరంబున నున్నను నే ముద్దియతో ముచ్చటలాడుచున్నను పంచప్రాణములు నీమీఁదనే నిలిపి శరీరము మాత్రము వారి కప్పగించి మనసునని న్నే స్మరియించుచుందును.

సత్య—అట్లయిన నీ యుపచారవాక్యములచే నామనం బిప్పు డించుక యూఱట డిల్లుచున్నది. సత్యభామావిధేయుఁడని పారిజాతేశ్వరునకుఁ గలిగిన బిరుదము సార్థక మగుఁగాక!

భ్రమ—అదిగో యున రమణిక వచ్చుచున్నది.

సత్య—(ఆత్రముతో) ఏది? ఏది?

[అప్పుడు రమణిక ప్రవేశించుచున్నది.]

రమ—(తనలో) అయ్యో! దేవితో నేనప్రియము విన్నవింపవలసినదాననైతిని గదా! సత్యభామ వాసుదేవు సమక్షమునకు న న్నేటికనిపె? పోయినదానను సందేశ మెఱిఁగించినతోడనే రాక యచ్చట నేల మసలితిని? ఇప్పు డది నేను తెలుప కున్ననుఁ గర్ణాకర్ణిని యీమె వినకపోదు. విన్నప్పుడు మున్నేటి కెఱిఁగింపకపోయితి వని నన్నీమె దండించును. తెలిసినచో వాసుదేవునకు నాపై నలుకపొడమును. సేవకా వృత్తి కేవల దుఃఖభాజనముగదా (మెల్లగా సత్యభామను సమీపించుచున్నది.)

భ్రమ—రమణికా! మోఁదఁబడిన తాఁబేటివలె నంత మెల్లమెల్లఁగ నడచు చున్నావేమి?

సత్య—దీని మందగమనమే నామనసున కాందోళనము గలిగించుచున్నది. అయిన నేమి చెప్పునో చూతము.

భ్రమ—ఓసీ! పలుకవేమె? మాధవునివార్త కాయా? పండా?

రమ—ఏదియనుకొన్నచో నదియే.

సత్య—హృదయేశ్వరుఁడు నాసందేశము నాలకించెనా?

రమ—చెవులుండఁగ నాలకింపకపోవుట యెట్లు తటస్థించును?

సత్య—వినుట యనఁగ నానందముతో నంగీకరించి వత్తునని చెప్పెనా?

రమ—మాటమాత్రము చెప్పెను.

సత్య—అట్లయిన రాఁడాయేమి?

రమ—ఏమో. ఆ విషయమయి నే నే మెఱుఁగుదును?

సత్య—నీ సందిగ్ధవచనములచే నా హృదయంబు పరితపించుచున్నది. అది

మాయం దగిలి వచ్చిన జనకుండు మఱచెను. అయ్యో! ఏమి యొనర్తును? పదునాఱు వేల సవతులలో నెవ్వరో పొందుమని నాతల వ్రాసియుండ నొకరిననేల? హా తండ్రీ! సత్రాజిత్తా! ఇంతటి సవతులలో నేను గారవ మొప్పఁగఁ జేయుదుననియు నన్ని కుహనాగోపాలున కిచ్చి వివాహ మొనర్చితివా? నీవా శ్రీకృష్ణస్నేహలోభంబున నాగొంతుఁ గోసితివి. (కన్నీరు విడుచుచున్నది.)

రమ—దేవీ! నేత్రద్వంద్వమునందు ముత్యములలీలం గాఱుబాష్పములఁ దుడిచికొని యించుక యూరడిల్లుము.

శ్రీమ—అమ్మా! భార్యాభర్తల కొక్క సమయంబునఁ బ్రణయకలహము సంభవించును. దానికింతేవంత నొందనేల? (సత్యభామ కన్నీరు తుడుచుచున్నది.)

సత్య—అయ్యో! యీకఱకు కపూర్వగర్వము గాంచి రూపలావణ్యంబుల జగత్ప్రసిద్ధి కెక్కినట్టి నన్ను నాసవతి యెట్టయెదుట నొకఁ డవమానింపఁ దా నొక మూఁగవానివలె నాలకించుచుఁ బ్రాణనాథుఁ డుదాసీనుఁడయి యుండ నే నూరడిల్లుట యెట్లు? నా హృదయశల్యముఁ బెఱుక నెవరితరము!

రమ—అమ్మా! ఇంతవిచారభారము నొంది చేయునదేమి? శాంతించి కార్యసాధన మొనర్చుకొనుట యుక్తము.

సత్య—ఇంక దేహత్యాగముకంటె నన్యసాధనములేదు. ఈయలంకారములు నీచీనిచీనాంబరములు, నీకుసుమధామములు నాకేల? ఆకామినీపంచశరుండు మత్సదనమున కరుదెంచి నన్ను సంభావించునని యెంచి యింత యలంకరించుకొంటిని. నాకును నాభాగ్యమునకును నారదమునికతమునఁ బారిజాతకుసుమముతో ఋణము తీఱినది. శరీరముపైఁ గల వృథాభిమానమున మఱియొకపనికి సాహసింపఁ జాలకుంటచే నే నీముహూర్తమె మారంభముగ నాహారవిహారాదుల విసర్జించి దేహము శుష్కింపఁజేసి నందనందనునకుఁ గన్నులపండువు చేసెదను. అహహా! దైవ మెంతకాలములో నా చర్యల నెంతవఱకుఁ దెచ్చెను? (ఏడ్చుచు) హా! ప్రాణనాయకా! నన్నఖిల నారీమండలమున నింతపరిభవించుటకు నీ కే మేని యొగ్గుచేసితిని? హా! ఇంక నతనికి నే నెక్కడిభార్యను. నన్నామహాత్ముఁడు దాసిగా నెంచెను. ఆతఁడు నన్నుఁ దన భార్యనుగా నాలోచించినచో నిట్లేల యొనర్చును? ఇంక నే నీశృంగారభవనంబున నిల్చు టెందుకు? నాకోపగృహంబున కరిగెదను. ఓసీ గుణమణికా! నీవు ద్వారము కడనుండి యామాయగోపాలకృష్ణుని రానియ్యకుము. (దుఃఖించుచు పోవుచున్నది.)

రమ—అయ్యో! సత్యభామ మహాకోపోద్దీపితురాలై యున్నది. ఈ నారదుఁడేల రావలె? వచ్చిన నేమి పారిజాతంబు కృష్ణున కేల యియ్యవలె? ఇచ్చెంబో కృష్ణుఁడు దాని సత్యభామ కేటికంపఁడయ్యె? పోనిమ్మది యట్లుండనిమ్ము. అంతకలహవినోదుఁడై నారదుఁడు సత్యభామను దూరఁబాఁడ కృష్ణుఁ డాతని నేల సంభాళింపఁడయ్యె. ఇంతకు దైవనియోగ మీక్రమంబున నుండ నన్యథా జరుగు టెట్లు ఘటిల్లించును? ఈ సత్యభామ నిజకాంచనచేలంబులు విడిచి మాసినచీరగట్టి సమస్తభూషణంబులు దీసిపైచి వెలుఁగులేని యాచీఁకటింట మూర్తీభవించిన శోకమునవలె నవ్వళించి నాకుఁ వెఱపు గొలుపుచున్నది. అయ్యయ్యో! ఎంతదుర్దశ గలిగెను? ఈ సాత్రాజితి మిక్కిలి పంతముగలది. ఎన్ని చెప్పినను వినదు. అయినను నింకొకసన్యాయము ప్రతినూలిచూచెదఁగాక! ఓసీ! భ్రమరికా! నేను దేని ననుసరించియుండెదను. గృహకృత్యంబుల నీవు నెరవేర్చుచుండుము.

భ్రమ—అట్లే చేసెదను.

రమ—(నిష్క్రమించుచున్నది)

భ్రమ—(తనలో) పండువంటి సంసారము క్షణములో చెడినది. ఏవేళ కేమి యెట్లగునో తెలియదుగదా? (నిష్క్రమించును.)

రెండవరంగము—సత్యభామ కోపగృహము.

[నగలు తీసి మాసినచీరఁగట్టి మంచముపైఁ బవళించి సత్యభామయు, నామెకు సురటీ వేయుచు రమణికయుఁ బ్రవేశించుచున్నారు.]

సత్య—ఓసీ రమణికా! మగవారికొఱకును తెట్టిపంపలస్వభావములో చూపితివి గదా! నతఁడు చేసిన యవినయచేష్టితములను నే నిప్పుడింతబిట్టులుకఁ బూనియున్న దానను గాని యామన్మథమన్మథుని ముఖారవిందదర్శనము చేయుటతోడనె నాకీబింకము నిలుచునా నిలువదా? యని సందేహించుచున్నాను. అయ్యో! ఎంత వెఱ్ఱిదానను? ఈ మందభాగ్యురాలికి మరల జీవితేశ్వరు దర్శనం బగుటఁగూడ లభించునా? సకలజలధరశ్యామమై యువతీజనమనోహరమై వెలయుభగవంతుని మూర్తి యెండియు నాకన్నులపండువ వెన్నఁడైన నొసఁగునే? ఇది వట్టియాస. నాభాగ్యమంతయు నాసవతుల పాలయినది. ఓసీ! రమణికా! నాకాయాసమధికమై మేను వెల్లఁ జెమ్మటఁ గ్రమ్ముచున్నది. కావున వింజామరతో నించుక విసరుము.

రమ—ఇదిగో నట్లే చేయుచున్నాను. అని (విసరుచున్నది.)

సత్య—అయ్యో! ఈ వ్యజనమునుండి వచ్చువాయువులు నా మేనికి వేఁడిగ నోఁచుచున్నయవి. ఇంచుక చల్లనిజలము దానిపైఁ జల్లి విసరవే.

రమ—నీ కెట్లు సుఖముగనుండునో యట్లు చేసెదను. (నీళ్ళు చల్లి విసరుచున్నది)

సత్య—హాయి. హాయి. ఇప్పుడించుక కన్నులు మూఁతలుపడుచున్నవి. చెలీ ! నీ విట్లె విసరుచుండుము. (అని యొక్కనిమిషము నిద్రించి యాకస్మికముగ మేలుకొని లేచి కూర్చుండి) ఓయి ! భర్తృగోపాలక ! ఇది రుక్మిణీమందిరమనుకొని పొరపాటున నిందు వచ్చితివా ? (అని చూచి తెల్లబోయి) ఓసి రమణికా ! ప్రాణవల్లభుఁ డిప్పు డిటకు రాలేదా ?

రమ—అమ్మా ! కలగంటివేమొకాని యాయన యిందు రాలేదు.

సత్య—అయ్యయ్యో ! నాజేలదినమును జూచి నీవు నవ్వుకొనుచున్నావు కాఁబోలును. ఛీ ! అందఱకును హాస్యాస్పదమగు నీజీవనము తోఁ బనియేమి? రమణికా ! ఆపూఁదోఁటకుఁ బోయి మాధవీలతే నొకదానినిఁ దెమ్ము. దానినిఁ గంఠాభరణముగ ధరించుకొని నాసవతుల కందఱకు నానందము గలిగించెదను.

రమ—(చెవులు మూసికొని) అమంగళము ప్రతిహతము గుఁగాక ! దేవీ ! ఏల యిట్లనుచితము లైనమాటలు రానిచ్చెదవు ?

సత్య—(ఆమాటలు వినిపించుకొనక) అయ్యో ! పరిచారికలుగూడ నాయాన నలక్ష్యము చేయుచున్నారు. ప్రాణనాథునికలన పరిభవమునొందిన కాంత పరిజనమునకును బరిహాసపాత్రమై యుండుఁగదా. ఓయదుకుంజరా ! నీకిల్లాలనైనందుకు నాయిల్లంబు పల్లవింపఁజేయుటకు మాఱుగఁ దల్లడిల్లఁజేయుటకునీకుఁ జెల్లునా? నాసవతుకును నొక్కక్షణమును బాయక సన్నానందవార్ధిఁ దేల్చుచుండు నీవు నేఁ డక్షీణసుఖసాగరమున ముంచుట నీకుఁబాడియే ? ఆరుక్మిణీకాంత నంత గౌరవించుటకును నన్నిట్లు తిరస్కరించుటకును నామె యొనర్చిన లగ్గేమి? నే నొనర్చిన యెగ్గేమి? నాజన్మాంతరపుణ్యంబిట్లుండ నిమ్మన నేల ? (అని కన్నులు మూయుచు నిద్రించుచున్నది.)

రమ—ఈమెకు నిదురపట్టినది. ఈనిద్రయందైన నీమె దుఃఖము మఱువవచ్చును అంతలో వాసుదేవుఁ డరుదెంచి, బుజ్జగించి, యలుకఁదీర్చి యీమెనుం బ్రసన్నురాలిని జేయఁగలఁడు. భార్యలపోలయలుకలు దీర్చుటలో నామహాత్మునికి గల నేర్పెవ్వరికిఁ గలుగదు ?

[అప్పుడు కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కృష్ణు—(తనలో) ఈవిషయమున సత్రాజిన్నందనకుఁ గోపకారణము లేకపోలేదు. ఏలయన ?

తే. గీ. రుక్మిణీ సత్యభామ లిర్వురను నేను
బంచితిని గూర్మి తులఁతూచు భంగి గాక

నిపుణ వైదర్భినంక పుష్పోత్తమార్థి
యతిశయంబుగఁ గన్పట్టు నామె మదికి.

అదియునుగాక సాత్రాజితి మహాప్రౌఢయుఁ బూర్ణయు గావున నీస్వల్పవిషయంబునకే మనస్తాపము నొందును.

రమ—(తనలో) ఎక్కడనో వచ్చుచున్నారు. (చూచి) అదిగో! కొంత జంకు లేక గోవిందుఁడే.

కృ—(నలుదెసలఁ జూచి తనలో) ఏమది? వాకిటను కంతయుఁ గ్రొత్తగ నగపడుచున్నదే.

సీ. కనుపండు వొనరించు కనకసౌధ మిదేమి? చిన్నెల నెడఁబాసి చిన్నవోయె
విజయస్వయదు పంద్రి విజయస్వ యనుచు నస్ఫుటకరింపద దేమి చిలుకపిండు
నిస్తరంగంబైన నీరాకరమువోలె మందిరం బిది యేమి మాఁటు మణఁగె
నళినలోచనతోడ నారాక నుతి గింపఁ బరగువారగ దిదేమి పరిజనంబు

ఆననంబులఁ జిఱునగ వంకురింప
నెదురు రా రదియేమి నా కింపుసుఖులు
కానఁబడ దేమి కన్నుల కఱవు దీఱఁ
జక్కదనమున నీవు మా సత్యభామ?

రమ—(నవ్వుచుఁ దనలో) ఇతరవ్యాపార విషయంబున నెట్లున్నను స్త్రీలవిషయంబునఁ బురుషులు మిక్కిలి బాలకనయిన మనసుగలవారు. ఇప్పుడీతఁడు భార్యను బతిమాలుట కామెను వెదకికొనుచు నెట్లు వచ్చుచున్నాఁడో?

కృ—(సత్యభామను సమీపించి రమణికతో) దీపికి నిప్పంటినదా? అట్లయిన నీచేతి వింజామర నాకిమ్ము. నా యపరాధము నా యుపచారముతోఁ దీఱును.

రమ—ఎదుట నుపచారము వెనుకఁ దిరిగిన నపచారము నలుపుట దేవరకే చెల్లినది. ఇదిగో వింజామరం బైకొనుఁడు. (ఇచ్చుచున్నది.)

కృ—(పుచ్చుకొని విసరుచుఁ దనలో) నే నుపచారము చేయుచున్నాను. గాని

క. ఈ వెలఁదుక కోపానల
మీవీవన విసర మంట లెగసెడునో? కో
పావేశము దీపకళిక
కైవడి వడి నాఱిపోయి కడమ ముట్టెడునో?

సత్య—(మేలుకొని) అధికముగ నిద్రాసుఖము గలిగినది. (స్వప్నమునభినయించి) ఆహా! ఇకను నెంతయుజాగ్రత్తతో విసరుచునే యుంటివంటే. ఎంతచల్లగాలితగులు చున్నదే. కాని యీమందవాయువులతో భూలోకదుర్లభసుగంధంబు వచ్చుచున్నది. రమణికా! ఈకస్తూరితావు లెచ్చటివే? (అని కృష్ణునిఁ జూచి మగల ముసుఁగు పెట్టుకొనుచున్నది.)

కృ—ఓశరత్కాల సంపూర్ణచంద్రాననా! నావదనసందర్శనము చేసి వెంటనె ముసుఁగిడనేల? ఓకళ్యాణీ! పూర్వమువలెనె,

చ. మెఱుఁగు బసిండియందియలు మేళిఝుంఝుళినాద మీనఁ జె
న్నెర నెమరేగుదెంచి యిరుచేతులఁ గౌఁగిటఁ జేర్పవేమి? యా
చిఱునగ వొక్క మద్దులకు స్వేదకణంబులు మోమునుండి నీ
చెఱఁగున నేర్పుతోఁ దుడిచి చేరువ దేటికి నాకు నున్నవల్. 4

ఓగంధసింధురరాజగమనా! కృపారసశీతలములగు నీ యపాంగావలోకనంబుల కయి యెదురు చూచుచున్న నన్నన్యబుద్ధిఁ దలంపఁ జెల్లునే? నేను పరుఁడను గాను. చూడుము.

ఆ. వె. ఇంచుకేని నీకు నెగ్గుసల్పనివాఁడఁ
దలఁపునందు నిన్నె నిలుపువాఁడ
నీయనుగ్రహంబె నెఱనమ్మికొనువాఁడ
నేలుకొనుము నీకు మేలువాఁడ. 5

ఓకళ్యాణీ! ఈవఱకును నీమాట జవదాఁటి యెఱుఁగను. ఇప్పుడును దాఁటుచున్న వాఁడఁ గాను. ఇఁక నెన్నఁడును దాఁటఁబోవను. గీచినగీటు దాఁటక నీయనుసన్నల మెలఁగు నీపరిచారకునిపై నింకఁ గోపంబు మానఁ జెల్లు.

సత్య—(తనలో) ఇంతటమానుకోపము గాదు. (ముసుఁగు బిగదీయుచున్నది.)

కృ—ఓమృగరాజమధ్య! రాకేందుబింబమును దెల్లమబ్బు గప్పిన చందమున లావణ్యపుంజమగు నీవదనాంబుజంబును వెల్ల ముసుఁగున నేలగప్పెదవు? నీవిలాసంబునకు నీహొయలునకు నీచాకచక్యమునకు, నీ వైదుష్యమునకు నీ మునికి యొప్పునే? కళ్యాణనిలయమగు నీమందిరంబును, నీయలంకారములను నింత చిన్న చూపు చూడఁ దగునే?

సీ. సిగబంతి నీకేమి పగయొనర్చిన దిప్డు ధరియింపకుంట కోతలిరుఁబోఁణి
హరిచందనం బేమి యప్రియం బొనరించె మైఁబూయకుంట కోమధురవాణి

పన్నిరుసల్పిన పాపకర్మమదేమి జలకంబుమానన్నో జలజనేత్ర!
జిలుఁగుదువ్వలువలు చేసినయొగ్గేమి కట్టుకుంటకు నేఁడు కలికిమిన్న!
తప్పుగలవారి దండించు టొప్పుఁగాని
యనపరాధుల శిక్షించు టర్హమగునె?
నిఖిలధర్మంబు లెఱిఁగిన నిన్నుఁబోలు
రాచబిడ్డకు సింధురరాజయాన! 6

దేవీ! నాతోడ దాఁగిలిమూతలాడక లెమ్మ. (ముసుఁగుదీయును.)

సత్య—(చెయ్యితీసివేసి) నాప్రచారము మీకేల?

కృ— (చిఱునవ్వు నవ్వుచు సత్యభామ గడ్డముపట్టుకొని)

తే. గీ. ఇంతమాత్రంపుఁబనికి నీకింత యలుకఁ
గలుగఁజెల్లునె? నామీఁదఁ గమలనేత్ర!
మగువలకు నల్ల పాడ సదా? మగలమీఁద
నిట్టిబింకంబు లుండునే యెచటనైన? 7

సత్య—(మొగము త్రిప్పుకొనుచున్నది).

కృ—ఓ మనస్వినీ!

సీ. ఈమేనిపరితాప మేమిటఁ జల్లారు బిగియారఁగౌఁగిటఁ బెనుపవేని
యీమనోభవదాహ మేమిట శమియించుఁ సాబగువాతెఱరుచి జూపవేని
యీమనస్సంతాప మేమిట నశియించుఁ జిఱునవ్వువెన్నెల జిమ్మవేని
యీవిరుఁగవత్రుప్పు లేమిట విడిపోవు నలరుఁదేనియ [illegible] పలుకవేని
యింతి నామేనఁ బ్రాణంబు లెట్లు నిలుచు
వాలుచూపులు నామీఁదఁ బరపవేని
యలుకమానగదవె మాటలాడఁగదవె
కరుణఁ జూపఁగదవె నన్నుఁ గావఁగదవె.

సత్య — (కోపముతో) ఓకపటగోపాలకా! నీహృదయంబు తెలంగు మఱుంగు లేక యెఱుంగుదును. అవసరము కలిగి మెఱమెచ్చుల ననురాగముఁ జూపుచున్న నీ వర్తన మెవ రెఱుఁగరు? ఆరుక్మిణి సదనంబునకే యరుగుము. నేను నీకు భార్య నగుదునా? అన్న న్నా! ఎంతమాట? కొంతసిగ్గు లేక మరల నాసదనంబున కెట్లువచ్చితివి? నీవుపద్గణమునఁడి రుక్మిణియానందించినట్లు నారదునిచే నన్నప్పు డట్లు ఘటించి యిప్పుడిట్లు మరల నన్ను బతిమాలుటకు దయచేసితివా?

కృ—ఓ త్రిలోకసుందరీ! చెప్పుడుమాటలు విని నన్నీచందంబున నిరాకరించుట యుక్తమా? నాయెదుట నీవధిక్షేపింపఁబడితివి గనుక తద్వృత్తాంతము నన్నడిగి యెఱుంగుము.

సత్య—నిన్నడుగ నేల? తెలియుటచేతనే యిట్లంటిని. నాసఖి దగ్గఱ నిందించినచో నాయెదుర నిందించునట్లుగదా? అగ్నిసాక్షిగఁ జేపట్టినభర్త కభిమానము లేకపోయినను నాచెలికత్తె కయిన నాపై నిందయనుక నభిమానమున్నది. రమణిక నాతోఁ జెప్పదనుకొంటివా?

కృ—అట్లేల యనుకొందును? దానికి నీపైఁగల యభిమాన మేనెఱుఁగనా?

సత్య—ఎట్లనుకొన్న నేమి? కలహవినోదియగు నారదుఁడు నన్ను నిందింప వీనులవిందుగా వినుచుంటివి కాఁబోలును. నన్నధిక్షేపించుట నిన్నధిక్షేపించుటకాదా? భార్యను భరించుపురుషుఁడు భర్త. ఇదియేనా నీభరియించుట? ఇదియేనా నీభర్తృత్వము? సతీపతు లన్యోన్యగౌరవములకొఱకుఁ జూడవలదా? సతి యన్యజనదూషితయగుచోఁ బతియుఁ బతియన్యజననిందితుఁ డగుచో సతియు నానందించుటయా యుత్తమస్త్రీపురుషలక్షణంబులు? నామీఁద నీకింతయనురాగము నింతయభిమానము నింతగౌరవము కలదని నేఁ డెఱింగితిని.

కృ—దేవీ! నావలన నేరములేదు. ఉన్నను నీకిది పాడిగాదు.

సీ. ఉవిద నీ కపరాధ మొనరించితినయేని మొలనూలితో నన్ను మోఁదరాదె?
తరుణి నీయెడ నేను తప్పుఁ జేసితి నేని పువ్వుబంతుల నన్ను రువ్వరాదె?
వనజాక్షి నీమాట జవదాఁటితినయేని కలువతూఁడుల నన్నుఁ గట్టరాదె?
మగువ నీపను పేను మఱచిపోయితినేని విరిదండసంకెల ల్వేయరాదె?

యొన్నఁ డిట్లు సేయవుగదె యింక ననుచు
గట్టిగా నన్ను శివాట్లు పెట్టరాదె?
యంతియేకాని యీరీతి నలిగి యలిగి
పలుకకుండిన నేనెట్లు బ్రతుకువాఁడ?

సత్య—అయ్యయ్యో! అట్లనఁబోకుము. అట్లుచేయవలసినది రుక్మిణి. సరిసరి. పట్టమహాదేవియై, మహాసత్కులసంజాతయై, పతివ్రతాశిరోమణియై యెల్లరస్తోత్రములకు బాత్రురాలయిన యాసుందరి యాచందంబునఁ జేయవలయుఁ గాని యెందు నామెను బోలక వినయము లేనిదానికి, యోగ్యలేనిదానికి, నాకట్టిగౌరవ మెందుకు? నేను జీవన్మృతురాలను.

కృ—(చెవులు మూసికొని) అయ్యో! దేవీ? నీ వీవిధమున నమంగళములు వచియించి నాకు వ్యథ నేలఁ గలిగించెదవు?

సత్య—అబ్బే! పొరపాటుగాఁ బల్కుచున్నారు. నావిషయమయి మీకు విషాదముఁగూడఁ గలుగునా? రుక్మిణీదేవీమధురస్వరముతోఁ బలుకకున్నను, జాంబవతి యాదరింపకున్నను, మిత్రవింద విందొనర్పకున్నను భద్ర తేరిఁగంటిచూపుఁ బఱపక పోయినను దక్కుఁగలవారు తక్కుఁగలసపత్నులఁ దయపకున్నను మీకు విషాద ముదయింపవలెనుగాని నాకొఱ కేల?

కృ—ఊ. ఏటికి భద్ర? జాంబవతి యేమిటికి? కేటికి మిత్రవింద? యిం
కేటికి నాకు నాగ్నజితి యేటికి రుక్మిణి! యెందు నీదు కా
ల్గోటికి నైన సాటి యనఁగూడనిచోటుల నాప్రశంస యి
ట్లేటికి మాటమాటకును నెత్తెదు మత్తగజేంద్రగామినీ! 10

సత్య—(కోపముతో) సందేహ మణుమాత్రమును లేక నీ వాక్రమమునఁ బలికెద వేల? ఆమాయలమారి యందములు మీతల కెక్కినవి. ఆమెయాలాపంబులు మీచెవుల కమృతప్రాయము లయినవి. ఆమెమందిరము మీకు నందనబృందావనమైనది. ఆమెయే మీస్వర్గము, మీమోక్షము, మీప్రాణము, ఒక్క నిముసమయిన నామె మీవియోగము సహింపఁజాలదు. వేవేగ నామెసన్నిధి కరుగుఁడు.

కృ—ఓమరాళగమనా! నీసదనముకంటె నామెవదనము నాకానందకరము గాదు. ఆమెకులుకులును నీయలుక లంత మనోహరములు కావు.

సత్య—మనోహరము లగుఁ గాక, కాకపోవుఁగాక, నాకదేల? ఆనారదుని సాహసమునకు నే నచ్చెరుపడుచున్నాను. ఆకలహభోజనుఁ డేమిగాఁ దలఁచెనో! ఆరుక్మిణీదేవికిఁ గులయాభిజాత్యము, సన్మానము, లావణ్యము నాకు లేవని తలఁచెను గాఁబోలు! అతఁడు బ్రహ్మఋషి గాని దేవఋషి గాని భయపడువా రెవరు? రుక్మిణిఁ యగ్రమహిషి యయినమాత్రమున స్తోత్రమునకర్హురాలయ్యెనా? ఆమె యంతటిదామె, నాయంతటిదానను నేను, ఆముని నన్నుఁ జాలనాఁడ మీ రెట్లూరకుంటిరి? రుక్మిణినిఁ గాదుకదా యనుకొంటిరి కాఁబోలును. నన్నా కలహాశనుండు నిందించుటకు మీరు తిట్టించుటకు నామె యాకర్ణించుటకు నేను మీదాస ననుకొంటిరా? రుక్మిణికి సేవకురాల ననుకొంటిరా? నారదుని పరిచారిక ననుకొంటిరా? ఏలిన నేలవలె లేనిచో నూరకుండవలె. ఈకొఱమాలినపను లేల?

కృ—ఆనిర్జరముని పారిజాతకుసుమము నాకొసఁగి నప్పుడు కొంచె మప్రస్తుతప్రశంస చేసినమాట నిజము. దానికి నే నూరకుంటినని నీవు దలఁపకుము.

సత్యా—(కోపముతో) ఆ దేవఋషీశ్వరుఁ డమందకుతూహలమున భవత్సేవా పరాయణుఁడై వచ్చి యా పుష్పము మీకుఁ గానుక యిచ్చిన నిచ్చెఁగాక మీ రా మరాళ కుంతలను కైసేయ మెప్పింప నామె కిచ్చిన నిచ్చితిరిగాక నిరర్థకముగ మా ప్రచారము లాహాబారమున నేల రావలెను? వచ్చిన మీ రేల యుపేక్షసేయవలెను?

కృ—సుందరీ! మునులతోడి ప్రసంగంబులు ప్రేమచుసామములతోఁ జరలాటములు కావున మహానుభావుఁ డగు నా బ్రహ్మమానసపుత్రున కెదురాడిన నెటువోయి యెటువచ్చునో యని యించుక జంకితిని.

సత్యా—అందుచేతఁ గాదు. ప్రాణపదమగు రుక్మిణీకాంతను మెప్పింపవలెనని. మీ వ్యాపారము నే నెఱుఁగనా? అనేక రాజకన్యలను జేపట్టి యందఱ మెప్పించు తలంపుతో సమయోచితంబుగ నిచ్చకము లాడుచు నిరంతరమబద్ధమే జీవనముగా కాంతా సేవయే వృత్తిగా విషయోపభోగసక్తమనస్కుఁడవయి యుందువు. ఒక భార్యయా? ఒక లోకమా? దైవానుగ్రహమున నీ యాదవవంశ సంభూతులకు రాజులకు రాజ్యప్రాప్తి శాపమూలమున లేకపోయెను గాని కర్మము చాలక సామ్రాజ్యమున్నచో నీ నారీమండల సంబంధము చేత వ్యవహార మొనర్చుటకయినఁ దీఱిక లేకపోవును. రాజ్యప్రాప్తి లేకుండుటయె మీకు మేలయ్యెను.

కృ—ఓసత్రాజిత్కుమారికా! ఆ సర్వంసహా రాజ్యము లేకున్నను నీ దయవలన మదనసామ్రాజ్యము పూర్ణముగ నున్నది. ఆ రాజ్యము మీ రాజ్యమువలె సుఖసుగానుండునా?

సత్యా—(కొంచెము సిగ్గుతో తలవంచుకొని) అవును. ఆ విభవము ముందును తరువాత దేవరవారను నవతరించిరనుమాట జగత్ప్రసిద్ధమే. కాని యే కాంత యెంత గౌరవమునకుఁ దగు నా కాంత కంత గౌరవం బొసఁగి సుఖపెట్టఁగల సామర్థ్యముగల యతఁడు బహుకాంతాపరిగ్రహంబు సేయు నొప్పును గాని తదితరుఁడు దక్షిణనాయకత్వంబున కనర్హుండు. మీరు శ్రీవైష్ణవాంశ సంభూతుల రనియు యదువంశోత్తంసుల రనియు, నిష్పక్షపాతహృదయుల రనియుఁ దలఁచి మాతండ్రి సత్రాజిత్తు శమంతక మాణిక్యసమేతముగా నన్ను మీకిచ్చి వివాహముఁ జేసెను. ఇట్లగుట యెఱిఁగినచో నతఁ డే మొనర్చియుండునో? ఇంతకును పారిజాతకుసుమ వాసనలు నాకుఁ జూపి నన్నుడికింపఁదలఁచి వచ్చితిరా? ఇంతమహానుభావులరని యెఱుఁగనైతిని. (కన్నుల నీరు నించుచున్నది.)

కృ—ఓపంకజగంధీ! నీ జనకుండు నాకు నిన్ను వివాహ మొనర్చుటచే నేను ధన్యాత్ముఁడ నయితిని. నే నరుదెంచినది నిన్నుడికించుటకుఁ గాదు. నావందనంబుల నీకుఁ దెలుపవచ్చితిని. కావున.

చ. కనులం దశ్రుజలంబు జాఱ మిగుల న్గప్పింప నెమ్మేను క
న్గొనల న్గెంపు జనింప ముల్లు లటు బల్లు ల్నెమ్మదిం గాడఁగా
ననుఁ గుందించెదవేల నేరమయిన న్సైరింపు చేకొమ్ము వం
దనము న్దాసుని తప్పు చెల్లును గదా దండంబుతో సుందరీ! 11

సత్య—(కోపముతో) ధూర్తా! అతివినయము చాలును. (అని యెడమ కాలి తోఁ గృష్ణుని తలను దొలఁగఁ ద్రోయుచున్నది.)

కృ—ధన్యోస్మి! ధన్యోస్మి! ఓకలకంఠకంఠి! నీవు నాదెసఁ గనఁబఱచిన యవమాన గౌరవంబు శ్లాఘాపాత్రంబు. ఆమహోత్సవముచే నాకత్యంతానందము జనియించినది. ఏలయన,

తే. గీ. వెలఁదు లెనమండ్రు వైవాహ విధులయందు
పొసఁగ ముత్యాలతలఁబ్రాలు పోయునపుడు
పేరటువిదలు సేసలు వెట్టునపుడు
కలికి! యింత యానందంబు కలుగ దయ్యె. 12

సత్య—అట్టియానంద మింకొకమాటు కలుగఁ జేయుదునా?

కృ—ముఖ్యముగఁ గలుగఁజేయవలసినదే (తనలో). ఈచంద్రానన మగల నన్నుం దన్న నాయేమి? (ప్రకాశముగా) ఓమరాళయాన? నేను ధన్యుఁడ నైతిని. నా దేహము పావనమయ్యె; కులము పన్నెకెక్కె; జన్మము సార్థకమయ్యె. స్త్రీపాదతాడన మహోత్సవముచేఁ జరితార్థులగు పురుషు లీప్రభాకరనిశాకరవంశముల లేరు. నేనే ప్రథమగణ్యుఁడను. మఱియును మదీయశిరోభాగము రెండు పర్యాయములు కృతార్థతఁ జెందినది. మొదట నరకాసుర సంహారంబు గావించు నాఁడు వాసవప్రముఖులగు గీర్వాణులు నన్ను దీవించి సేసలుగఁ జల్లిన పారిజాతకుసుమంబులచేతను, రెండవది మంజుకనక మంజీరమంజులశింజితసమేతంబగు నీపాదపల్లవంబుచేతను, ఓమరాళకుంతలా! ఈకార్యంబు నాహృదయరంజకంబయ్యెఁ గాని కంటకప్రతిమాన [illegible] శిరోజ సంపర్కంబున నీయరుణపల్లవకోమలంబగు పదంబు కందినదో, నాకిరీటమాణిక్యంబులు తగిలి నొచ్చినదో, కోపోద్రేక పరవశత్వంబున నన్నుం దన్నుతఱి నీనర మేదయిన బెణఁకినదేమో యని యత్యంతము భయపడుచున్నాను. ఒకవేళ నిది యనుచితమని నీవు సందేహింతువేమో?

మ. పరుఁడంగా నెద సందియంపడకు నీపాదారవిందద్వయీ
పరిచర్యం బొనరించి ధన్యతను సంపాదించు నీదాసుఁడ

స్వామిసన్నిహితుఁడ నైతి నీకటుల సంభావించి చేపట్టుట
న్తరుణీ! దండన కర్హుఁడౌ మనుజుని న్దండించు టొప్పౌంగదా! 13

కావున నింక నైన నల్కమాని చిలుకపలుకులు పల్కి నన్నాదరింపుము.

సత్య—(పశ్చాత్తాపముతో) అయ్యో! నేనెంత యదృష్టహీనురాలను. ప్రాణేశ్వరుని వామపాదంబునఁ దన్నితినని యపనింద గల్గుట గాబోలును. ఇంతవరకు మా యత్త దేవకీదేవి నన్నందఱుకోడండ్రలోఁ బెద్దఁజేసి యత్యంతగౌరవంబునఁ జూచు, ఇప్పుడు పతియెడ నవినయంబుఁ జూపి యామె మొగ మెట్లు చూతును? భర్తయెడ నొనర్పరానికోప మొనరించిన యీ మేనిపై నభిమానము విడిచెదను. ఛీ! ఈవ్యర్థజన్మమేల? (కన్నీటితో) ఇంక మదీయ శయనాగారంబు లేక మలయమారుతపథంబు గావలెనో! నామందిరోద్యానసీమల నేరాము విహరింప నోచుకొన్నదో! నాకీర, శారికా, మయూర, మరాళము లేమరాళగమన నానందింపఁజేయునో? నా యేడువారముల నగలు నేమగువ ధరించునో? నా కాంచనాంబరము లేయంచయాన కట్టునో? (కృష్ణుని పైఁదలఁజేర్చి) హా! ప్రాణనాథా! నన్ను మీరంత పరిభవించుటచేతఁగదా నా యవస్థ యిట్లుండుట.

కృ—(చిఱునవ్వుతో సత్యభామ కన్నీరు తుడుచుచు)

తే. గీ. ఇంతలేసి సాహసములా యిందువదన!
యంతమాత్రింపుచునికి నేకాంతమందుఁ
జేడియ లొనర్చు శృంగారచేష్ట లివియు
వేళ్వదోరకైన నీయవి వేడ్కఁ జేయు. 14

దేవీ! ఇంక విషాదముతోఁ బనియేమి? ఏదికావలయు నన్న నదియె యొసఁగుదు. ప్రసన్నవగుమ్ము.

సత్య—(సంతోషముతో) అట్లయినఁ గోరినదాని నిచ్చెదరా?

కృ—త్రికరణశుద్ధిగ నిచ్చెద. త్వరితముగ నడుగుము.

సత్య—అట్లయిన రుక్మిణికడ్డనున్న పారిజాతపుష్పము నాకిప్పింపుఁడు.

కృ— దేవీ! ఒకరు తలముడిచిన ప్రాఁచిపువ్వము నపేక్షింపనేల? అదియునుగాక నామె కిచ్చినదానిని మరలఁ దెమ్మనుట యనుచితము.

సత్య—(కోపముతో) అవును. ఆరుక్మిణి నడుగుటకు మీకధిక భయము కావున నది యపేక్షింపఁగూడదనుచున్నారు. ఆవిదర్భరాజపుత్రిక మీకుఁ బ్రాణము నామెకు మీరు ప్రాణము. నేను వ్యర్థముగ మిమ్మడుగుటయె కాని నామనోరథము సఫలమగు నని యనుకొనలేదు. ఇంతమాత్రమునకుఁ గోరిక కోరుమననేల?

కృష్ణ—అట్లు కాదు. ఆరుక్మిణి కొకపుష్పమె యొసంగితినిగాని నీకుఁ జూడుము. ఆయమరలోకంబున కరిరి సమీర సమవర్తి, సముద్రేశక, సర్వభక్షకాదులగు దిక్పాల కులఁ గూర్చుకొని యాదేవేంద్రుఁ డడ్డమువచ్చిన నచ్చుఁగాక.

ఉ. మానవతీలలామ! ఏను మాట లిఁకేటికి? నీవు మెచ్చి యా
నౌనన, నాశచీరమణి యచ్చెరువందఁ, బడంక ముజ్జగం
బే నమరావతీపురికి నేగి, చొరంబడి యింద్రునందనో
ద్యానము, పారిజాత వసుధారుహమున్ గొని తెచ్చి యిచ్చెదన్. 15

సత్య—(సంతోషముతో) ప్రాణేశ్వరా! నాకంతటి మహాభాగ్యము గలుగునా?

కృష్ణ—సందియ మేమి? పారిజాతవృక్షమునుం దెచ్చి నీమందిరోద్యానవన మధ్యభాగమునందుఁ గమలాకరతీరంబున మాకందపున్నాగ మహీజములకు నడుమ మల్లికావల్లికలకు సమీపమున నాటించెదను. నీకేళీవనం బాయింద్రునందనమ్ము మీఱును, నీ వాశచీని మీఱుదువు.

సత్య—జీవితేశ్వరా! ఈమాటలు ముమ్మాటికి నిశ్చయమే కదా! ఇదియే నిశ్చయమయినచో నేనాశచీదేవిని మించుటయె గాక రుక్మిణి మొదలగు సపత్నులకన్న నెక్కుడుదాన నగుదును.

కృష్ణ—దేవీ! ఈవఱకే నీవు వారలకన్న నెక్కుడుదానవు. ఇఁక మీఁద నా పారిజాతపుష్పంబులఁ గోసి యనుదినంబును నీసఖీజనంబు లతిభక్తితో నీకేశపాశమ్ములయందు ముడువఁగా మహాప్సరోయతిసుందరముగా నుందువు కాబోలుఁను? అప్పుడు నేను జ్ఞాపకముందునా?

సత్య—(లజ్జనభినయించుచు) దేవా! కాఁగలకార్యమునుగూర్చి సంతోషింప రాదు.

కృష్ణ—దేవీ! కాదు. కాదు. సహజలావణ్యముగల నీవా స్వర్లోకసుమంబుల ధరియింప నెట్లుందువో యూహింప నేరకున్నాను. అదియునుగాక నాదేశీమండల మున నీసమానలు లేరు. నీవదనశరదిందు దాగధగ్యంబును, నీనీలకుంతలముల నైగ నిగ్యంబును నీయత్యధిక చాకచక్యంబును నేసుందరియందుఁ గలదు?

శా. నీవిన్నాణము, నీయొయారమును, నీనిర్వ్యాజలావణ్యమున్,
నీవాఙ్మాధురి, నీచమత్కృతులును, నీసొంపు, నీకే తగున్
దేవీ! నీ కెన రాఁదలంచి తపముల్ వేయేండ్లు గావింప నీ
ఠీవా వైదర్భికి రాదు నీవిలసనం బంభోజపత్త్రేక్షణా! 16

సత్య—(సంతోషముతో) దానికేమి కాని పారిజాతమునిమిత్త మింద్రలోకంబునకు వెడలుదము రండు.

కృష్ణ—రేపు ప్రతయమునఁ బోవుదము. కాని యమరలోకమునఁ గేకారణముఁ గల్పించుకొనిపోవలయునో యెఱుఁగకున్నాను. దేవతలు సునరాఁకకుఁ గారణ మడుగకపోరు.

సత్యా—నాథా! కారణము లేకేమి? నరకాసురునిచేత మున్నపహరింపఁబడిన యదితికుండలములను మీ రారక్షసుందునిమి తెచ్చినవాది దేవరయె స్వయముగ నమరలోకంబునకుఁ బోయి దేవమాత కాకుండలముల నర్పింపవలయునని పలుమా అనుచుండువారే కదా! ఇప్పుడావంకఁ గల్పించుకొని మన మమరావతికిఁ బోవుదము.

కృష్ణ—అవును. చక్కనిమాట జ్ఞప్తికిఁ దెచ్చితివి. అట్లయిన స్వర్గలోక ప్రయాణంబున నతులితచతురతగల గరుత్మంతునిపయి నధిరోహించి పోవుదము కావున నీవును మందిరంబున కరిగి స్వర్గప్రయాణ ప్రయత్నము చేయుము.

సత్యా—చిత్తము. (అనిపోవుచున్నది.)

కృష్ణ—ఈస్వర్గ ప్రయాణవార్త ప్రియమిత్రుఁడైన కైరవున కెఱిఁగించెద. ఆతఁడెక్కడ నున్నాఁడో?

[కైరవుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కైర—(తనలో) మా వాసుదేవుఁ డెందున్నవాఁడో? (ఇటునటుఁ జూచి) అదిగో నిచ్చటనె యున్నవాఁడు. కాని యితఁడేదియో దీర్ఘాలోచనను జేయుచున్నట్లున్నవాఁడు. (కృష్ణుని సమీపించుచు.)

కృష్ణ—కైరవా! నీవుకూడ మాతో వచ్చెదవా?

కైర—ఎక్కడకు?

కృష్ణ—ఎఱుఁగవా? ఇంద్రలోకమునకు.

కైర—ఎందుకు?

కృ—పారిజాతముఁ దెచ్చుటకు.

కైర—ఎవరు తెమ్మనిరి?

కృ—సత్యభామ.

కైర—ఆమెనొక్కతెనె మీరింత గౌరవింపనేల?

కృ—నారదముని పారిజాతపుష్పము నొకదాని నిప్పించి రుక్మిణి నిదివఱకె గౌరవించెను.

కైర—అట్లయిన సత్యభామాదేవి మిమ్ముంబరుషోక్తులచే నొప్పించి యుండఁబోలు.

కృ—పరుషోక్తుల నాడుటయే కాదు. ఆమె కాలియందియల బంగారముతో నాతలకిరీటపుబంగారమును వియ్యమొందించినది. స్త్రీలెంత సాహసురాండ్రో చూచితివా? మనమున నీవు నామాత్రము సందేహములేక యెంతపని చేసినదో!

కైర—(పెద్దపెట్టున నవ్వుచు) తన్నినదా? కాని మాధవా? ఆమె పరమ మునియని మ్రొక్కితివా? లేక దేవుఁడా, గురువా? తల్లియా, తండ్రియా, ఎవరును కాని మ్రొక్కితివి? వందనానర్హయగుభార్యకు నీవు సందేహములేక వందనము చేయఁగా నామె సందేహింపక తన్నుట తప్పేమి? ఆమె నీకుఁదగినభార్య. నీవామె కుఁదగిన భర్తవు.

కృ—మిత్రుఁడా! దానికేమి కాని యింద్రలోకముఁ జూచుటకు నీకింత కన్న సమయము దొరకదు. చూడఁగోరెదవేని రమ్ము.

కైర—(కొంచెమాలోచించి) మీరు గరుత్మంతునిపై నెక్కిపోవుదురు. నేనక్కడఁ గూర్చుండియున్న పక్షమునఁ జల్లగాలితగిలి నాకుఁగునికిపాట్లువచ్చును. అంత యెత్తునుండిపడితినేని చచ్చిపోఁగలను. లేక లేకయంతల్లికి నే నొక్కఁడనెకుమారుఁడను నేను రాను.

కృష్ణ—అట్లయిన నేను వసుదేవబలదేవాదులతోడను రుక్మిణి, జాంబవతి, మిత్రవింద మొదలగు నంతఃపురకాంతలతోడను జెప్పి పయనమునకు సిద్ధమయ్యెదను.

కైర—నీవు ముందరుగుము. నేనును క్షణములో వచ్చెదను.

కృ—మిత్రుఁడా! అంతఃపురకాంతలకు నే నీవార్తఁ జెప్పఁబోవునప్పుడు నీవు నాసమీపమున నుండవలయును. కావున సత్వరమున రమ్ము. (నిష్క్రమించును)

కైర—(తనలో) పురుషులు కాంతాజనంబులయెడలఁ బ్రవర్తింపవలసిన తెఱంగునఁ బ్రవర్తింపరేని యిట్టివైచిత్ర్యంబులు సంభవించుచుండు. అదియటుండఁగాక. బహుభార్యాపరిగ్రహణము సేయు నతఁడందఱు మెప్పింపఁదలఁచి తుద కెవ్వరి మెప్పు వడయలేక యెల్లరకు నాగ్రహపాత్రుఁడగును. ఇతఁడు రుక్మిణీదేవినిఁ బ్రసన్నురాలిఁ జేసికొనఁదలఁచి, సత్యభామ కాగ్రహపాత్రుఁడయ్యె. సత్యభామ యనుగ్రహముఁ బడయఁదలఁచి రుక్మిణి కలుక తెప్పింపకపోఁడు. తనయమరలోకప్రయాణ వృత్తాంతము నంతఃపురస్త్రీల కీయన యెఱుంగఁ జేయునపుడు నన్నుఁ దనతో నుండుమనియె. కావున నేనిప్పు డచ్చటి కరిగి యాముచ్చటలు ప్రసంగములు కని విని యానందించెదను.

(అని నిష్క్రమించుచున్నాఁడు.)



శ్రీ

# పారిజాతాపహరణము.

## తృతీయాంకము.



ప్రదేశము—రుక్మిణీదేవి అంతఃపురము.

[రుక్మిణీదేవి ప్రవేశించుచున్నది.]

రుక్మి—(తనలో) ప్రాణేశ్వరుండు నాకు పారిజాతకుసుమము నొసంగుటచే సత్యభామ నిశ్చయముగా నాగ్రహించియుండును. ఆమె యేమన్నదో యెట్లున్నదో నామూలమున హృదయేశ్వరున కెట్టికష్టములు గల్గుచున్నవో తెలియకున్నదానను. మా కెట్టికలహములు గల్గునో గదా! నారదమునీంద్రుఁడేల పుష్పమును దేవలెను! హృదయేశ్వరుండది నాకేల యీయవలయును! ఏమియుఁదోఁచదు.

[అంతట నారదుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

నార—(తనలో)

తే. గీ. జగడమున్న దినంబు పండుగ దినంబు
కలహములు లేని నాఁడు లంఘనము నాకు
నీశ్వరానుగ్రహముచేత నింతదనుక
గడపుచున్నాఁడ దినములు కఱవులేక.

శ్రీకృష్ణుఁడు సత్యభామాపేరితుఁడయి స్వర్గమునకుఁ బోవుటయు, సత్యభామ యలుఁగుటయు, నీ దర్భరాజనందన కెఱుఁగఁజేసెద. అంతటఁగాని యాకలహంబు పరిపూర్ణదశ నొందదు. నాప్రజ్ఞావిశేషంబుచేత నేగదా బ్రహ్మాద్యమరగణ పూజ్యమగు మాధవు శిరస్సును సత్యభామ యెడమ కాలితోఁదన్నినది. నాప్రజ్ఞలింకనుజూపెదను. ఇదిగో రుక్మిణి యొంటరిగా నిందుకూర్చున్నది. సమీపించుట కిదియే మంచిసమయము (సమీపించును.)

రుక్మి—(తనలో) ఏమికారణంబుననో సురమునీంద్రుఁ డిటువచ్చుచున్నాఁడు. (ప్రకాశముగా) నారదమునీంద్రా! వందనము.

నార—సుందరీ ! కళ్యాణమస్తు. ఎద్దియోదీర్ఘాలోచన చేయుచున్నట్లు గన్పట్టుచున్నావు.

రుక్మి—దేవా ! ఆలోచనయేలేదు. కాని—

నార—కళ్యాణి ! నీస్థితిఁజూడ నాకు మిక్కిలి విచారముగానున్నది. పాపము నీవేమి చేయఁగలవు ? ఈద్వాపరయుగమున మంచివారికి దినములు గావు.

రుక్మి—దేవా ! అట్లనుచున్నారేమి ? మీ రూరక యట్లనరు. కారణమేమో వేగముగా నడుగవలయును.

నార—ఊరక యట్లులన్నాఁడను. కారణ మేమియు లేదు.

రుక్మి—(ఆత్రముతో) అట్లని మీ రూరకుండుటచే నాయాత్రము నాపఁజాలకున్నాను. స్త్రీసామాన్యమునకుఁగల తొందరయంతయు నేఁడుమూర్తీభవించుచున్నది. ఆవిషయమై నాకు వడిగాఁదెల్పి నన్ననుగ్రహింపుఁడు.

నార—నిరంతరమును శ్రీమన్నారాయణసేవాపరాయణుల మగు మాకు సంసారసంబంధము లగుగొడవ లెందుకు ? మాటవచ్చినది గనుక చెప్పవలసివచ్చెను.

రుక్మి—దేవా ! నిజము వక్కాణించుటకు మీరింత శంకింప నేల ? ఎంతోసందలించిన శాంతింపని నాహృదయమునకు మీసుధారస సమభాషణములచే శాంతి యొసంగుఁడు.

నార—(తనలో) ఇంక నీమెకు నేఁ జెప్పఁదలఁచినదేమో చెప్పెదను. (ప్రకాశముగా) సుందరీ ! నీవుపట్టమహాదేవివైనను, పరమసాధ్వివైనను, శ్రీమహాలక్ష్మిస్వరూపురాలవైనను నీయందు లేశమును నీప్రాణేశ్వరునకు గౌరవము లేదుగదా !

రుక్మి—అట్లయిన నే మానినియందాయనకు గౌరవము గలదు ?

నార—పరమధూర్తయు, నీభాగ్యగ్రహాబాహ్యురాలును, నీకు నెడతెగనిబాధాకరిణియు నగు నీసవతి సత్యభామయందే. అంతకంటె నికనెవరియందు ? నీ సమీపమునందున్నప్పుడు తేనెసోనలవంటి తియ్యనిమాటల నాడునుగాని హృదయమందు సత్యభామ యన్నచో మక్కువమెండు. ఆమె పేరుచెప్పిన గడగడ వడంకును. వేయేల ? ఆమెగీచినగీటు దాఁటఁడు. పాపము తెల్లని వన్నియును పాలును, నల్లని వన్నియు నీరు నని యెంచి చెప్పిన నదియే నమ్మియున్న నీవంటి వెఱ్ఱిదానిని నే నెందును జూడలేదు.

రుక్మి—దేవా ! ఆమెయందంతమక్కువ యున్నట్లు గుర్తేమి యున్నది ? ప్రేమయున్నదని చెప్పుటకు దృష్టాంత ముండవలెఁగదా ?

నార — అయ్యో! కన్ను లుండియు గ్రుడ్డిదాన వైతివిగదా! నీ కాపుష్పమును మాధవుఁ డిచ్చినందుకు నాతనికి జరిగిన గౌరవము నీ వెఱుఁగవు గాఁబోలు!

రుక్మి — సత్యభామ యేమి చేసినది?

నా — నోటికి రానిమాట లన్నియు నని నిందారోపణములఁ జేసి యింతయేల చేయవలసిన యమర్యాదలన్నియుఁ జేసినది. నిన్నాడినమాటలు, నిన్ను చేసిన నిందలు నేఁజెప్పనురాదు నీవు విననురాదు. అవి యట్లుండఁ దుద కానందనందనుం డా సుందరీచరణారవిందములకు నమస్కరించెను.

రుక్మి — (ఆశ్చర్యముతో) సత్యభామకు ప్రాణేశ్వరుఁడు నమస్కరించెనా? ఎంతపనిచేసెను? అయ్యయ్యో!

నార — సుందరీ! ఆశ్చర్య మొందెద వేల?

తే. గీ. క్షితిని బాలించుమూర్ధాభిషిక్తులైన
నడవులందు వసించుమహర్షులైన
విపులధనవంతులైన నిర్ధనులైన
పడఁతుకలయొద్ద మగవారు పానిసీలు.

రుక్మి — దేవా! నేను మిక్కిలి సిగ్గుపడుచున్నదానను.

నార — నీవు దీనికే సిగ్గుపడుచున్నావు. అట్లు నమస్కార పురస్కారముగా బతిమాలుచున్న ప్రాణేశ్వరుని సత్యభామ తనయెడమకాలితోఁ దన్నినది.

రుక్మి — కటకటా! ఎంతపని జరిగినది. తన్నుటయే? ప్రాణేశ్వరుం డంతట నేమి చేసెను? నాశరీరము కంపమెత్తుచున్నది.

నార — నీవు పరమశాంతవు గావున నీకు భయముగా నున్నది. నీప్రాణేశ్వరుం డామెపై కోపపడెనని యనుకొనుచున్నావా? అయ్యది స్వప్నవార్త. సత్యభామా మహాదేవిమీఁద నలుగుట కాయనకు నోరువచ్చునా? ఆపని యొనర్చినది నీవేయైనచో నిన్నేమిచేయునో! సత్యభామ నీవంటి వెఱ్ఱిది కాదు. ఆమెసంగతి యటుండనిమ్ము. కృష్ణుం డెట్లూరకుండునో! సర్వలోకపూజ్యపదారవిందుఁడగు తన్నొక యాఁడుది యట్లు పరాభవింపఁ దానుగాన నోర్చుక యూరకుండెను గాని మఱొక రూరకుందురా? పాపము నీస్థితియేమియు బాగుగ లేదు అవును. ప్రాణేశ్వరుం డందఱి నొక్కరీతి మచ్చునఁ జూడవలెను గాని కొందఱిమీఁదఁ బక్షపాతముఁ గనఁబఱిచినచోఁ దక్కినవారికిఁ జాలఁగష్టముగా నుండును. ఆతఁడు చేయునగౌరవమునకును, బక్షపాతమునకును, నవమానమునకును సాధ్వీమతల్లివి నీవోర్చుచుంటివి గాని మఱొకరైనచో నేమి

చేయుదురో! ఇంతకు నీతల్లిదండ్రుల పూర్వజన్మ సంపాదితపుణ్య విశేషమున నీవంటి కుమారి గలిగినది. కార్చిచ్చువధ్యమని చెప్పఁదగిన యీసవతులమధ్యమునఁ గాపుర మెట్లు చేయుచుంటివో పరమాత్ముఁ డెఱుఁగును. ఆకృష్ణునిటక్కరితనంబునకును, నాలి ముచ్చు చేష్టలకును, దొంగనవ్వులకును, దేనెమాటలకును, మాయాకార్యంబులకును, గోపమేమో యెఱుంగని నీవు దొరికితివి గనుక నాతని యాగడములు సాగుచున్నవి.

రుక్మిణి—నారదమునీంద్రా! పారిజాతపుష్పము మహాద్భుతముల నెన్నింటిని సృష్టించినది.

నార—ఆపుష్పమునైనను నేను బలవంతపెట్టిన కారణమున నీకిచ్చెను గాని లేకున్నచో నిచ్చునా? సత్యభామ కీయవలెనని మనస్సులోఁ బూర్ణముగానున్నది.

రుక్మి—అందుచేతనే కాఁబోలు జాల సందేహించెను.

నార—ఆ! నిశ్చయ మొఱింగితిని. నిజము నిలుకడమీఁదఁ దెలియును. నా మాట యబద్ధము కాదుగదా?

రుక్మి—దేవా! కలహ మెందుకు? ఆపారిజాతపుష్ప మాసత్యభామ కిచ్చెదను.

నార—నీపుష్ప మామె కెందుకు? నీవెంత. నీపుష్ప మెంత. ఈమహాభాగ్య మామె కక్కరలేదు ఆమెకు ముల్లోకంబుల సాధింపఁజాలిన ప్రాణనాథుం డుండ లోపంబేమి? ఇంద్రలోకంబున కరిగి పారిజాతవృక్షము నే పెల్లగించి యాతఁ డామె కిచ్చునఁట. ఇంద్రలోకప్రయాణము నీ వెఱుంగవు కాఁబోలును. సత్యభామయు నాతం డును బోవుదురఁట. నీశాంతమే నిన్నింతవఱకుఁ దెచ్చినది. నీవొక్క మా టెదిరించినచో న్యాయం జక్కఁబడును.

రుక్మి—(విచారముతో) నావంటి యదృష్టహీనురా లెందునులేదు. నాజన్మ మెందుకు?

నార—(తనలో) నాప్రయత్నమిప్పుడు పూర్తిగా నెఱవేరినది. (ప్రకాశముగా) సుందరీ! నిష్కారణముగ నిం మాడి నిష్ఠురముఁ దెచ్చుకొంటిని. అయినను దాని నిజము నీకే తెలియును. కాని నీమంచితనమే నీకు సంతాపకారణమాయెను. ఒక్కసారి నీ వెదురు తిరిగినపక్షమున నీయధికారమే చెల్లును.

రుక్మి—దేవా! మీరు చెప్పినదంతయు నిశ్చయము.

నార—(తనలో) ఈపర్యాయము నామనఃపూర్తిగా కలహ ముదయింపఁజేసితిని. (ప్రకాశముగా) కళ్యాణీ! ఇంక నే నరిగెదను. (పోవుచున్నాఁడు.)

రుక్మి—(తనలో) ప్రాణనాథునకు సత్యభామయం దత్యంతానురాగము గల దని నారదమునివల్లభుండు వక్కాణించిన దంతయు నిశ్చయమే. కానియెడల నన్న

జన దుర్లభమగు పారిజాతమహీరుహము నాసత్యకేల యిచ్చెదనని ప్రతిజ్ఞ చేయును! ఆవృక్షమును హృదయేశ్వరుం డామె కిచ్చినచో జనుల కందఱకును నామెయందే మహాగౌరవముండును. ఇంతకు సత్యభామ నోఁచిన నోముల ఫలమిట్టిది.

[అంతట కృష్ణుఁడును, కైరవుఁడును ప్రవేశించుచున్నారు.]

కృష్ణ—కైరవుఁడా!

సీ. భోజనందనఁ జేరి పొలయల్కలను దీర్చి సత్యభామను గూడి సరసమాడి
జాంబవతీదేవి సల్లాపములనెంచి మిత్రవిందను డాసి మేలమాడి
ముద మొప్పఁ గాళింది ముంగురుల్ సవరించి లక్షణయడుగుల లాక్షఁ బూసి
భద్రచెక్కులమీఁదఁ బత్రముల్ రచియించి నగ్నజిత్తనయ లేనగవు మెచ్చి
పువ్వుబోండ్లకుఁ బొలుపులుపొడమకుండ
పొడమినవి యంతకంతకుఁ బొదలకుండ
నందఱమనస్సు లేకచాయ నలరఁ జేసి
యనుభవించుచు నున్నాఁడ నధికసుఖము.

అందుచేత మేము సురలోకప్రయాణము చేయుటకు ముందుగా రుక్మిణితోఁ జెప్పవలయును గదా?

కైర—అయ్యో! కాదామఱి. భార్యదగ్గఱ సెలవుపుచ్చుకొనక పోయినయెడల మర్యాద దక్కునా?

కృ—సత్యభామ నిమిత్త మే నింద్రలోకమున కరుగుదుననియు, నామెకై పారిజాతమహీరుహంబును దెత్తుననియుఁ జెప్పిన నాదేవి యేమనునో.

కైర—ఏమనును తనభాగ్యమును నిందించుకొనుచు నూరకుండును.

కృ—కలహోదయము కాకుండ శాంతింపఁజేయఁజాలనా? రుక్మిణి మిక్కిలి సాధువు. అయినను దీనికిందగు నుపాయమేదైనఁ జెప్పుము. నీవు మిక్కిలి నిపుణబుద్ధివిగదా!

కైర—ఎన్నఁడును నీకు భార్యల తగవులాటలలో నుపాయములు చెప్పఁజాలక నా ప్రాణము విసిగిపోవుచున్నది. అదిగో రుక్మిణి సమీపింతము రమ్ము.

కృ—మిత్రుఁడా! నేఁబోయి బతిమాలెదను. నీవీద్వారముకడనే యుండుము. నాకొఱకెవరు వచ్చినను రానీయకుము. (రుక్మిణి సమీపించును.)

కైర—నాకింక పనియేమున్నది. అట్లే చేయుదునులె.

రుక్మి—(తనలో) అదిగో జీవితేశ్వరుం డిటకే వచ్చుచున్నాఁడు. (లేచి ప్రాణేశ్వరా! జయమగుఁగాక!

కృష్ణు—ఓహో! శ్రీకృష్ణపట్టమహాదేవి కాఁబోలును! నీముఖారవిందదర్శనార్థమై నీహృదయేశ్వరుం డరుదెంచినాఁడిదిగో. ఏమీ! ఈసుందర మాన చింతాక్రాంతయైనట్లు గనఁబడుచున్నది. నా స్వర్గలోకప్రయాణప్రయత్న మెవరైనఁ జెప్పిరా యేమి ?

రుక్మి—మీపట్టమహాదేవి సత్యభామ. నా కామాత్ర మదృష్టము కూడఁ గల్గునా నేనే మీహృదయేశ్వరి నైనపక్షమున పారిజాతవృక్షము నాకే యిచ్చుట కిష్టపడుదురు.

కృ—(తనలో) ఎవరో యీసంగతి నీమెకుం దెల్పిరి. (ప్రకాశముగా) కళ్యాణీ! సత్యభామ యెట్లుపట్టపుదేవి యగును? నిరుపమసౌజన్యనిలయవగు నీ వెక్కడ? గర్వపూరితయగు సత్యభామ యెక్కడ? నీకును నామెకును హస్తిమశకాంతరము కలదు.

రుక్మి—ఈముఖప్రీతిసంభాషణములతోఁ బనియేమి? త్వరగా నింద్రలోకప్రయాణోన్ముఖులుగండు. సత్యభామ మీయ లస్యమున కోర్వఁజాలదు.

[అంతట సత్యభామ ప్రవేశించుచున్నది.]

సత్య—(తనలో) ప్రాణేశ్వరుండు రుక్మిణీ మందిరంబున కరిగియుండును; నేనుగూడఁ జని యామెయొద్ద నాకలోక ప్రయాణమునకు ననుజ్ఞ వడసెద. ఇదిగో! కైరవుఁ డిచ్చటనే యున్నాఁడు. (ప్రకాశముగా) ఓయీ! కైరవా! ప్రాణేశ్వరుం డెక్కడ?

కైర—రుక్మిణీమందిరంబున నున్నారని మీ కెవరు చెప్పిరమ్మా!

సత్య—అట్లయిన నన్నా స్థలంబునకుం దీసికొనిపొమ్ము.

రుక్మి—దేవా! మీరింక మసలరాదు. సత్యభామ యాగ్రహించును. వేగముగా నింద్రలోకమున కరుగుఁడు.

కృ—ఆసత్యభామకు కోపమెంత? ఆమె సెలవేల?

రుక్మి—మీనిమిత్తమే గాఁబోలు సత్య యిటు వచ్చుచున్నది.

కృ—(చూచి తనలో) అయ్యో! నామాటలనీమె వినియుండఁగూడదు. కైరవుఁ డీసత్రాజిత్కుమారిక నిచ్చటి కేల తీసికొని రావలయును? (ప్రకాశముగా) దేవీ! సత్యభామా! యిటువచ్చితి వేల?

కైర—రావలసినవా రందఱు వచ్చినతరువాత నే గదా జరగవలసిన చమత్కారమంతయు జరగుట.

సత్య—సురలోక ప్రయాణమునుగూర్చి మాయక్కగారి యనుజ్ఞ వడయుట కయి వచ్చితి.

కృ—మంచిపని చేసితివి.

రుక్మి—అమ్మాయీ! నీవినయము చక్కదనమునకు మెఱుఁగుఁ దెచ్చుచున్నది. సత్యభామావిధేయునిచేత పారిజాతము ద్వారకానగరమున నాటఁబడుఁగాక!

సత్య—అక్కా! అటుగాదు. రుక్మిణీవిధేయుఁడనుము.

రుక్మి—కాదుకాదు. సత్యభామావిధేయుఁ డనుటలో విశేషార్థముకలదు.

సత్య—(కొంచెము కోపముతో) ఆవిశేషార్థ మేమో నా కింతక తెలియం బల్కుము.

రుక్మి—అమ్మాయీ! కోపపడకు. ఇందు నేను నిజమే పలికితిని.

సత్య—కోపపడకుమని నన్ను మందలించుటకు నేనంత మహాకోపముగలదానను నీవు పరమశాంతురాలవు కాఁబోలు!

రుక్మి—నా కేమిశాంత మున్నది? శాంతమునకు నీవు పెట్టినది పేరు. శాంతము నందు యోగులయినను నీకుఁ జాలరు.

నైర—వహావ్వా! వహావ్వా! వీరిమహావైర మనెడునగ్ని నిందాసంభాషణము లనెడు గాలిచే రాజి మండుచున్నది.

కృ—ఓసుందరులార! నిష్కారణముగ నన్యోన్యతిరస్కారముగ దూషణ భాషణంబులతో నేల కలహించెదరు? సమయాసమయముల నైన నెఱుంగ రేమి?

రుక్మి—కలహమాడుటకంటె మాకు వేఱుపని యేమున్నది?

సత్య—నీవంటిదాని కంతకంటె పనులేమియు నుండవు

రుక్మి—కయ్యమునకుఁ గాలుదువ్వెద వెందుచేత? ఊరకున్న కొలఁది నొక్క వహుసనే నల్లెసమీఁదికిఁ బండిపోయినట్లు నామీఁదికి నవలీలగా వచ్చెదవు.

సత్య—ఊరకుండక నీవు చేయఁగల దేమున్నది?

రుక్మి—చేయఁగలదాన నైనపక్షమున నీవ ట్లనఁగలవా? తంత్రములచేతను మందులచేతను ప్రాణేశ్వరునిమనసు విరిచి నీయొడిలో వేసికొన్నావు. నిన్నెవ్వ రేమి చేయఁగలరు?

సత్య—(కోపముతో) ఏమీ! నోటి కెంత వచ్చిన నంత యాడెదవా? నీకంటె నెక్కువమంత్రములు మందులు నేర్చినవా రెవ్వరునులేరు. పెద్దదాన వైన నీవు భర్తను నెట్లు స్వాధీనము చేసికొంటివో పిన్నవాండ్ర మైన మేమును నట్లె చేసితిమి. పాపము భూలోకమాతవు; ఏమీ నీవగలాఁడితనము.

రుక్మి—నావగలాఁడితనము నీ వెఱుఁగవా? నీవంటిసుశీలయెదుట నేనువగలాఁడిని గానా? ఇంతగయ్యాళితనము కూడదు.

సత్య—నావంటిగయ్యాలితో నీవుకాఁగాఁ బాపము వేగుచున్నావు. గురివెంద గింజ తన యడుగున నున్న నలు పెఱుఁగదఁట! పైకి మహాసాధువువలెఁ గనఁబడుచు లోపలఁ గుట్రలు చేయు నీవంటిదానను నే నెట్లగుదును.

రుక్మి—పిల్లికన్నులు మూసుకొని పాలుఁద్రాగి తన్నెవ్వరు చూడలేదనుకొనునఁట నీగుణంబుల నందఱు నెఱుంగుదురు. మఱియుమఱుగసాధుత్వ కౌటిల్యముల నెఱుఁగనివా రెవరు?

సత్య—తన్నుఁదాను మెచ్చుకొన్న దన్నుకొన్నట్లే యుండును.

రుక్మి—చాలు చాలు. నీపాండిత్యము నింకఁ గట్టిపెట్టుము. అవ్వల హృద యేశ్వరుఁ డున్నది యయినను జూడవేమి? ఇంత సిగ్గును విడిచిపెట్టితి వేమి?

సత్య—(మహాకోపముతో) ఏమీ! సిగ్గును బరిత్యజించితివా? నీ వేమో పట్ట మహాదేవివని నీయిష్టము వచ్చినట్లు నన్ను నిందింపఁ జూచుచున్నావు. నీయాధిక్యము నీ వేయుంచుకొమ్ము. తారతమ్య మెఱుఁగక మాటలాడుచున్నావు. అన్యభామాగర్వ నిర్వాపణసాహసనీమ యగు సత్యభామ యని నన్నెఱుంగుము.

రుక్మి—సకలలోకైకపూజ్యుఁడును శ్రీమన్నారాయణావతారుండ నగు ప్రాణే శ్వరుని నీయెడమకాలితోఁ దన్నినప్పుడే నీసాహసము నే నెఱిఁగితిని. నే నేకాను. ముజ్జగంబులవారు నెఱుంగుదురు. ఎంతసాహసురాలవు కాకపోయిన నంతపని చేసి తిరిగి తగుదునమ్మా యని నలుగురిమొగము నెట్లు చూచి బ్రతికియున్నావు?

సత్య—ప్రాణేశ్వరునకు జరిగిన గౌరవము నీకుఁగూడ జరుగవలయునా యేమి?

కైర—మాధవా! ఈమె యందఱను వరుసపెట్టి తన్నునాయేమి?

కృష్ణ—సుందరులారా! నామాట వినరుగదా! అమితానురాగము గలిగి పర స్పరమైత్రిం జెందుటకు మాఱుగా నిట్లు కలహమాడుట న్యాయమగునా?

సత్య—నావలన లోప మేమున్నది?

రుక్మి—ప్రాణేశ్వరా? ఇందు నాతప్పే మున్నది?

కైర—ఎవరివలనను లోప మేమియు లేదు.

సత్య—ఎవరితప్పు వారికి తెలియదు.

రుక్మి—తెలిసినపక్షమునఁ జక్కఁగా నుండును.

సత్య—తెలియకపోవుటచేత నే యింతముట్టుకు వచ్చినది.

రుక్మి—ఎంతముట్టుకు వచ్చిన నాకేమి భయము.

సత్య—నాకే భయమున్నది?

రుక్మి—నీకు భయములేదన్నమాట నేనిదివఱకే యెఱుఁగుదును.

సత్య—నీకు సిగ్గులేదన్న మాట నే నెఱుఁగుదును.

రుక్మి—నీసాంప్రదాయమును బట్టియు, నీబుద్ధిలక్షణంబులం బట్టియు నీమాటలు వచ్చుచున్నవి.

సత్య—నా సాంప్రదాయమునుగూడ నిందింపవలెను గా. నీయన్నగారు నీస్వయంవర మహోత్సవసమయంబునం దెంత పరాభవ మొందెను.

రుక్మి—నీసాంప్రదాయముమాత్ర మేమంత వెలిఁగినది? శమంతకమాణిక్యమపహరించినాఁడని మాధవుపై నపనిందవైచిన సత్రాజిత్తుకుమారివి గావా? నీతండ్రివలెనే నీవును నిష్కారణముగ నితరులపై నిందలు వేయుచుందువు.

సత్య—నీవలె నేను దొంగపెండ్లి చేసికొనలేదు.

రుక్మి—నీవలె మగనిని తన్ని యింద్రలోకమునుండి పారిజాతమును దెప్పింపఁ దలఁచుకొనలేదు.

సత్య—తెప్పించుకొనుటకు స్వాధీనముఁ జేసికొనుటకు నాకు సామంతముగలదు. నీనోర్వలేమి నిన్నే కొట్టినది. తనకు లేదని విచారించిన నొకకన్ను యెదుటవారికిఁ గలదని విచారించిన నొకకన్నును బోయినదఁట. అప్రయోజకురాలవు! నీవెందుకుఁ జేతకానిదానవు గావున నీపుణ్య మట్లున్నది గాని నాకేమి?

రుక్మి—నీకుఁ గల మహదైశ్వర్య మేమి? నే నోర్వలేని దేమి?

నైర—ఇఁక నీకలహమున కంతములేదు కాఁబోలు!

కృ—(తనలో) అయ్యో! ఈ కాంతామణు లియువురు నొకరికంటె నొకరు మాటలయందుఁ దీసిపోరు. వీరికలహనివారణోపాయము నాకుం దోఁచకున్నయది. ఏమిచేయుదును. ఈపారిజాత మేమికష్టము దెచ్చినది? ఏమి చేయుదును? (ప్రకాశముగా) ఓరుక్మిణి! ఓవిదర్భరాజనందనా! నీవయిన నూఁరకుండవుగదా? (చేయిపట్టుకొనును.)

రుక్మి—(చేయి విదుల్చుకొని) నాయందున్న ప్రేమయంతయు నేఁడు తెలిసినది చాలుఁజాలు నన్ను బతిమాలనక్కఱలేదు.

కృ—(సత్యభామచేయిపట్టుకొని) ప్రాణేశ్వరీ? నామాటచెల్లించి కలహనివారణము గావింపవుగదా?

సత్య—(చేయి విదుల్చుకొని మొగముఁ ద్రిప్పి) నన్ను బతిమాలెదరేల అదిగో మీయర్ధశరీరంబును, మీపట్టపుదేవియు నగు విదర్భరాజనందన. నాదగ్గఱ వచ్చెదరు?

కృ—ఓపట్టపుదేవీ! నీకోప మేటికి? ఊరకుండుము.

రుక్మి—పట్టపుదేవిని గాఁబట్టియే దగ్గరనుండి సత్యచే నిట్టికఠినోక్తులనాడించితిరి. సరిసరి. నాసమాచారము మీ కెందుకు ?

కృ—భామాశిరోరత్నమా! సత్యభామా! హృదయేశ్వరీ! నన్నిట్లు తిరస్కార మొనర్ప భావ్యమగునా ?

సత్య—హృదయేశ్వరి నగుటచేత నే పట్టపుదేవిని వెనుక వేసికొనివచ్చి అనరాని మాటలనిపించితిరి నన్నామె నిందించుచుండఁగా వినినారుగదా. మీ చెవులపండువుగా నున్నదా ? ఆమెమాటలు మీకింపుగ నున్నవిగదా ?

కైర—మాధవా! ఇద్దఱుభార్యల నడుమను దిరుగుచుండుటచేత కాళ్ళునొప్పు లెత్తుచున్నవి కాఁబోలు. నిన్నుఁజూడ నాకు జాలివేయుచున్నది.

కృ—ఓకాంతలారా! మీరు పావనతరసుక్షత్రియవంశసంజాత లనియు, నగణ్యతారుణ్యలావణ్యశోభితలనియు, నిరుపమానసద్గుణనిలయలనియు, మిమ్ము వివాహమాడితినిగాని క్షణక్షణాగ్రహపీడితలయి నాకింత మనఃక్లేశ మొసంగుదురని కాదు. ఓసత్యా! నిరుపమానయశోవిభ్రాజితుఁడగుసత్రాజిత్తున కపకీర్తి సంఘటించుటకు నీకు సందేహము లేదుగదా ?

సత్య—(రోసముతో నేడ్చుచు) నాయందేమియు లోపము లేకపోయినను నన్నే యవమానించుచున్నారు. పక్షపాతముచే మీకు న్యాయాన్యాయములు తెలియుటలేదు నన్ను మీ రెప్పుడు నిట్లే పరాభవించుచుందురు.

కైర—వివాదములుపోయి దుఃఖముబయలుదేఱినది. తొందర ముదిరి యూసరవెల్లి యయినది. బతిమాలుకొనువా రున్నట్లయిన బొల్లిబొల్లి యేడ్పు లెన్నిగ్గైన నేడువవచ్చును.

కృ—సుందరీ! సత్రాజిన్నందనా! నేను నీయందు నేర మెంచలేదు. ఓ రుక్మిణీ! విదర్భరాజపుత్రికవుగదా నీవు. సత్యభామ వయస్సున నీకంటెఁ జిన్నది. ఆమెకంటెఁ జిన్నదానవుగ నుండునట్లు కనఁబడుచున్నావు.

రుక్మి—అంతఃఉ భార్యలలోను దేవరవారికి లోకువ నే నొక్కర్తనే. మెత్తనివారిని చూచిన మొత్తబుద్ధిగదా !

కృ—యుక్తాయుక్తపరిజ్ఞానవిహీనముగ నిట్లు మాటలాడుచుండ నే నేమి చెప్పఁగలను ?

కైర—నే నీబ్రాహ్మణజన్మ మెత్తకుండ శ్రీకృష్ణునిభార్యలలో నొకర్తనై పుట్టినయెడల నాముచ్చటఁ దీఱునట్లు బతిమాలించుకొందునుగదా! నన్ను బతిమాలువారే లేరు.

కృ—ఓశరచ్చంద్రముఖీ! రుక్మిణీ! కలహనివారణ మగునట్లు నీ వీసత్యభామతో మాటలాడుము.

రుక్మి—నావలన లోప మేమున్నది. నే ముందుమాటలాడను.

కృ—ఓసత్రాజిత్కుమారీ! రుక్మిణి నీకంటెం బెద్దది. కావున నీవే ముందుగ మాటలాడుట ధర్మము.

సత్య—నావలన లోప మేమున్నది? నేముందు మాటలాడను.

రుక్మి—ఎవనివలన లోపమున్నదో యీకైరవు నడిగెదను. ఓయీ కైరవా! నావలనం దప్పు కలదా?

కైర—అమ్మా! మీయందు లోపము లేశము లేదు.

సత్య—అట్లయిన నాయందా లోపమంతయు నున్నది?

కైర—తమయందు వంతకంటె లోపములేదు.

రుక్మి—అదియేమి సాక్ష్యమయ్యా బ్రాహ్మణుండా. ముందుగా నెవ్వ రెవ్వరి నేమాట లనిరో చెప్పు.

కైర—గురువుగారు చెప్పినపాఠములే జ్ఞాపక ముండని నాకు మీతగవు లెట్లు జ్ఞాపక ముండును? అయినను జ్ఞాపకము చేసికొని చెప్పెదను. కొంచెముసేపు మీరూర కుండుఁడు.

రుక్మి—(తనలో) ఈతఁడు నాపక్షము పలుకఁడా?

సత్య—(తనలో) ఈతఁడు నాపక్షము పలుకఁడా?

కృ—(తనలో) ఈకైరవుఁడు నిష్పక్షపాతచేతస్కుఁడు.

కైర—ముందుగా రుక్మిణీదేవిగారు సత్యభామాదేవిగారిని నిందించినారు. అంత కంటె ముందుగా సత్యభామాదేవిగారు రుక్మిణీదేవిగారి నన్నారని జ్ఞాపకము. ఒకరు, ఒకకారణముచేత నొకరిని ముందుగా నొకమా టొకమాట, నొకప్పు డన్నారు. వెంటనే రెండవవారు, రెండవవారిని, రెండవమాఱు రెండవమాటను రెండవకారణ ముచే, రెండురెట్లుకోపముతో నన్నారు. అదే నే నెఱిగినసంగతి. మీఁద మీ చిత్తము.

కృ—నీచమత్కార మంతయుఁ దెలియునట్లు మిక్కిలి హాస్యాస్పదముగ సాక్ష్యమిచ్చితివి.

రుక్మి—ఇట్లసందర్భముగా సాక్ష్యమిచ్చినందుల కీకపటబ్రాహ్మణ కుమారుని శిక్షింపవలెను.

సత్య—తప్పక శిక్షింపవలెను.

కైర — నాప్రాణముమీఁదికి వచ్చినది దేవా! నా కేశిక్షనిర్ణయించినను సరే కాని సహస్రజన్మములకైనను నాకిద్దరుభార్యలుమాత్రము గట్టిపెట్టవద్దు. అది నాపగవాండ్రకైనను వద్దు మహాప్రభూ!

రుక్మి — (తనలో) ఇతఁడు చమత్కారవచనములచేమాకుసిగ్గుఁ గల్పించినాఁడు.

కృష్ణు — (తనలో) కైరవుఁడు కడుచమత్కారముగాఁ బల్కినాఁడు. రుక్మిణి యీగర్భోక్తులం దెలిసి కలహము మానును.

రుక్మి — అమ్మాయీ! సత్యభామా!

సత్య — (పలుకక తనలో) ఈస్నేహముల కేమిలే?

కృ — (సత్యభామతో రహస్యముగా) నీవు విదర్భరాజనందనతోఁ బ్రత్యుత్తర మిచ్చి పలుకవేని మన యింద్రలోక ప్రయాణ మాటంక మగును.

సత్య — ప్రాణేశ్వరా! అట్లయిన మాటాడెద. అక్కయ్యా! కోపావేశముచేత నన్నమాటలఁ దలఁచుకొనకు.

రుక్మి — అమ్మాయీ! నాయెడల తప్పులున్న క్షమింపుము.

కైర — ఇప్పుడు నా బెదరు తీఱినది.

కృ — ఓవిదర్భరాజపుత్రీ! ఇంద్రలోకప్రయాణ సన్నాహముతో నున్న మాకు నీ వనుజ్ఞనిమ్మ. నీయాజ్ఞలేక నేఁగదలువాఁడనుగాను. ప్రాణేశ్వరి! సత్యభామా! సెలవుఁ గైకొనుము.

సత్య — అక్కయ్యా! అనుజ్ఞనిమ్మ. మేమింద్రలోకంబున కరిగి మరలవచ్చెదము.

రుక్మి — అమ్మాయీ! అట్లేపొమ్ము. ప్రాణేశ్వరా! వేగము గారండు. మీయాలస్యము సహింపఁజాలను.

కృ — ప్రాణేశ్వరీ! పోదమురమ్మ.

(తనలో) తే. గీ. నేల నాలుగు చెఱఁగుల నేలవచ్చు
నాజిఁ బగతుర నవలీల నదమవచ్చు
నిపుణమతి బ్రహ్మవిద్యయు నేర్వవచ్చు
నంతిపురి స్త్రీల జగడంబు లడఁపరాదు.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# పారిజాతాపహరణము.

చతుర్థాంకము.



ఇంద్రలోకము.

రంగము—మందాకినీనదీతీరము.

[సత్యభామయుఁ గృష్ణుఁడును బ్రవేశించుచున్నారు.]

సత్య—అహాహా! ప్రాణేశ్వరా! అతివేగముననే వచ్చితిమి. మనము ద్వారకా నగరమును బాసి యెంత సేపయినది.

కృ—దేవీ! ఒకజామయినది అతివేగంబున వచ్చితిమి. ఎట్లనిన గరుత్మంతుని యొక్క—

చ. అగణితపక్షవేగమున నట్లు జనించినగాలిచేత నో
మగువరో! యిట్లునట్లుఁ బలుమాఱులు నీవలె వాటుపైఁట చెం
గగురుచునుండ నీవు నది యెంతోచిరాకునఁ గూర్చుచుండ సొం
పగు చక్రవాకయుగ మప్పుడు దాఁగురు మూఁత లాడెఁగా.

సత్య—(సిగ్గుతోఁ దలవంచి) ప్రాణేశ్వరా! ఇది యేప్రాంతము?

కృ—ఓసుగాత్రీ జిన్నిందనా! ఇది యింద్రలోకప్రాంతము. మందాకినీతీరము. శ్రీమన్నారాయణపదజాతం బగు నీనది త్రికూటముపై మూఁడుపాయలైనది.

సత్య—ఆపాయ లెందెందుఁ బాఱుచున్నవి.

కృ—సకలలోక పవిత్రీకరణ స్వభావయై, మందాకినీ నిర్మలనామంబున, నాకాశవాహినియై యిందును, భూమండల మండనంబై భాగీరథి నామంబునను, పాతాళప్రపంచపావన సమర్థంబై భోగవతి యను పేరను, ప్రసిద్ధమయినది. బ్రహ్మ నిఖిలనిర్జరగణాధారం బయినదియు, శ్రీమహేశ్వరజటాజూటంబున నిల్చినదియు జహ్నుముని కర్ణజనితంబగునదియు, భగీరథనీతం బగునదియు, నీమహానదియే.

సత్య—అవు నదిగో. అరవిందమ్ముల మధ్యమ్మునఁ జేరి కుత్తుకబంటిగఁ దేనెగ్రోలి తమ్మునెఱుంగక నిమ్మగుసంతసమ్మున ఝుమ్మని నినదమ్ములం జేయు, మధుపమ్ములంజూచి

యిది నదీ యనుకొంటిని. కానీ యీయమరలోకప్రవేశముం గావింపకముందే యీలోక నాయకుఁ డెవ్వఁడో యతనిపరిపాలనాసక్తు లెవ్వరో యెఱుంగఁజేయుఁడు. ఏదానిం గూర్చి గాని ముందువిని తదనంతరంబు దానింగనిన సంగతి పరిపూర్తిగాఁ దెలియును.

కృష్ణు — హేలావతీ! యీలోకంబున కధీశ్వరుం డింద్రుండు. అతం డనంత శాంతోదారగుణుండు. అపారధైర్యసుయ్యండు. వజ్రాయుధస్ఫారప్రశస్తహస్తుండు. అతనిభార్య శచీదేవి. ఇందిరానందసుందరుం డగుజయంతుం డాతనిపుత్త్రుండు. ఐరావతం బాతని యెక్కుభద్రగజంబు. ఉచ్చైశ్శ్రవం బాయనవాహనహయంబు. నందన వన మాతని పూఁదోఁట. అందే మనపారిజాతంబున్నది. అతఁడే స్వర్గమర్త్య పాతాళంబులకు నేకచ్ఛత్రాధీశ్వరుఁడు. అతనిరాజధాని సకలమునిగణాశ్రితంబగు నమరావతి. అది నిరంతరసచ్చిదానందనిలయంబు. సకలసౌఖ్యకరంబు. అఖిల వైభవరత్నాకరంబు. అఖిలకళావిద్యాశోభితంబు. ఆ త్రిదశసభామధ్యంబున బలశాసనుఁడు మెండుసంతసంబున నిండుకొలువుండఁగా దేవకిన్నర కింపురుష సిద్ధ చారణ, విద్యాధర, గరుడ, ఖేచరాదులును, నారదవసిష్ఠాది నాకలోకమునీంద్రులును, గొలుచుచుందురు. రంభోర్వశీమేనకాద్యమరవేశ్యాకాంతల, నృత్యగానవినోదంబులచే బలసూదనునకు మోదంబు గల్గింతురు. మఱియు లోకభీకరయుద్ధంబులఁ బ్రసిద్ధంబుగ మృతినొందువారును, యజ్ఞాదికర్మంబుల నిర్మలమతి నొనరించు ధర్మాత్ములును సౌఖ్యంబుల ననుభవింప నిచ్చోటికి వత్తురు. అదియునుంగాక యీత్రిలోకపాలకుం డన్యదిక్పాలకసేవితుండై, ఈతండు ప్రాగ్దిశాభాగంబున కధీశ్వరుండు. అల్లదే యతని పట్టణము చూడుము. పారికాంచనద్యుతివజ్రనాళధళ్యంబును, గణనాతీతసోపానస్థితేంద్రనీలమాణిక్యవైగనిర్యంబును, కాంచనస్తంభములపై ఖచితంబులయిన బహురత్నములధాగధగ్యంబును, నేత్రంబులకు మిఱుమిట్లుఁ గొల్పెడు, కెందామరపువ్వుంబులచేతను, నల్లగలువలచేతను, తెల్లగలువలచేతను సొంపుమీఱియున్న సరోవరంబుచందంబున నెట్లు భాసిల్లుచున్నదో చూడుము.

సీ. శత్రుభీకరమైనజంభారిజయరమా నూపురం బగుజుమీ యీపురంబు
కడలేకవర్ధిల్లు కళ్యాణములకెల్లఁ గాపురం బగుజుమీ యీపురంబు
ఈరేడుజగముల నెనలేనిసిరులకు దాపురం బగుజుమీ యీపురంబు
అధికతేజశ్శాలి యమరనాయకుఁ డుండుదివ్యపురం బగుజుమీ యీపురంబు
కల్పవృక్షపంచకమును కామగవియు
నమృతకలశంబు నందనోద్యానవనము
నేపురంబును బాయక యెప్పు డుండు
నాపురంబగు నీపురం బోపురంధ్రి !

సత్య—జీవితేశ్వరా! అది చూచితినిగాని యీయింద్రుండు తూర్పుదిక్కున కధీశ్వరుండని సెలవిచ్చితిరి. మిగిలినదిక్పాలకు లేకోదువదిక్కుల కధీశ్వరులా? అట్లయిన నెవ్వరెవ్వ రేయేదిక్కున కధీశ్వరులో యందు ముఖ్యులెవ్వరో సెలవిండు.

కృష్ణ—కీరవాణీ! ఇంద్ర, యమ, వరుణ, కుబేరులు, దిక్పాలకశ్రేష్ఠులు. అందు నింద్రుండు ప్రాగ్దిశకును, అపరిమితసత్యనియముం డగుయముండు దక్షిణదిక్కునకును పరాక్రమాభరణుండగు వరుణుండు పశ్చిమదిక్కునకును, శత్రువిదారుండగు కుబేరుం డుత్తరదిక్కునకు నధిపులు. ఆఁవాయింద్రు చరిత్రంబుఁ జెప్పితినిగదా! దక్షిణదిక్పాలుండగు నాకాలుండు నిర్వర్తించుకార్యంబులం దెలిపెదవినుము. అనృతప్రలాపంబులాడి, నిరంతరదురాచారులయి పరనారీలోలురయి అన్యద్రవ్యాపేక్షకులయి పరహానికరులయి నిర్దయహృదయులయి జంతుఘాతకులయి యుండు మహాపాతకు లాతని లోకంబుఁ జేరుదురు. వారి నంతఁ రౌరవాద్యనేక మహానరకంబులఁ బొలియించి బాధించుచుండును. అందినుపముక్కులు గల కాకులు, నగ్నిస్తంభంబులు, నగ్నికుండంబులును, రక్తప్రవాహంబులు నుండును.

సత్య—దేవా! మరణానంతరంబున నిట్టిదారుణబాధలు గలుగునని యెఱింగియు నిట్లు జనులు పాపంబులఁ జేయుదురా? అందఱు పుణ్యమునే చేయుదురనియు నీలోకంబున కెవ్వరు రారనియుఁ దలంచెదను.

కృష్ణ—కల్యాణి! ఎంత వెఱ్ఱిదానవు. శ్రవణ, దర్శనభయంకరంబు లగు నింతటి మహానరకంబు లుండుటచేతనే యాఁగెను గాక, లేకున్నచో లోకంబాగక నేపోవును. ప్రపంచమున నధర్మకార్యాసక్తులును, బాపాత్ములును నధికంబుగ నుందురు ఎల్లవారును వీలయినచోఁ బాపకార్యావలంబనంబుఁ జేయుదురుగాని పుణ్యకార్యంబు నవలంబింపరు. అందుచేత జనం బీలోకంబున నెక్కువయుందురు. అది యటుండ నిమ్ము. పశ్చిమదిగధీశ్వరుం డయిన వరుణదేవుండు భూమండలమునఁగల సకలసముద్రిమ్ముల కధీశ్వరుం డయి యుండును. ఈతండు పాశాయుధశోభితపాణియయి సకలపాపసంఘంబుల లంఘించి బాధించును. మఱియును నుత్తరదిక్పాలకుండగుకుబేరుండు శ్రీమహేశ్వరప్రాణమిత్రుండు ధనంబునకెల్ల నాతఁడు ప్రభువు. అతనిపురం బలకాపురంబు. అతని కుమారుండు మారసుకుమారుం డగు నలకూబరుఁడు. అతని ఆయుధంబు మహాఖడ్గంబు. మఱియుఁ బరాక్రమహాగ్యత్తులగుయక్షులకు వల్లభుండు. వీరు ముఖ్యదిక్పాలకులు.

సత్య—ప్రాణేశ్వరా! తక్కిన దిక్పాలకు లెవ్వరు?

కృష్ణ—ప్రాగ్దక్షిణభాగంబుల నడుమనున్న మూలదిక్కున కధీశ్వరుం డగ్నిదేవుండు. అతండు సకలయజ్ఞహవిర్భాగంబులం దెచ్చి దేవతలకు నివేదించును. ఆమహా

త్ము నికారణంబున నే సకలలోకప్రజలును నగ్నిహోత్రంబు గలిగి సుఖింతురు. మఱియు దక్షిణపశ్చిమదిక్కులకు మధ్యమున నిర్ఋతియను దిక్పాలకుండుండును. అతఁడు రాక్షసుండు. మఱియు పశ్చిమోత్తరదిక్కులకు మధ్యముననున్న భాగంబునకు వాయుదేవుం డధీశ్వరుండు. అతండు నిజసంచారవిహారంబులచేత లోకంబుల కుపకారంబుఁ జేయుచుండును. సకలభూతజాలంబులకును వాయువే ముఖ్యుం బగుటచే నీతండు ముఖ్యప్రాణుం డనియు, వాయు దానమున సకలలోకరక్షకుం డగుటచేఁ జగత్ప్రాణుం డని యును బిరుదులు గలిగియుండు. అదిగాక శ్రీరామపాదారవిందభక్తుం డగు నాంజనేయుండును, ధార్తరాష్ట్రివ్యూహకంఠీరవుం డగు భీమసేనుండును, నీవాయువుపుత్రులే సుమీ? మఱియు దైశాన్యకోనకప్రాంతం డగు నీశానుం డెనిమిదవదిక్పాలుండు. ఇదియే దిక్పాలకుల వృత్తాంతంబు.

సత్య—ప్రాణేశ్వరా! ఈస్వర్గలోకవృత్తాంతంబును, దిక్పాలకుల వృత్తాంతంబును సమగ్రంబుగ మీరు నా కెఱుంగఁ జేయుటం జేసి శ్రవణపావనంబైనది. ఇంక నాయింద్రోద్యానవనంబున కరిగి జగద్విఖ్యాతం బగు పారిజాతంబుఁ దెచ్చికొందము రండు.

కృ—దేవీ! అట్లు గాదు. వేగిరపడఁబోకుము. మనము జన్మంబున కొక్కసారి స్వర్గలోకమునకు వచ్చి, యందు స్తోత్రపాత్రమ్ము లగు విచిత్రమ్ముల దర్శింపక పోవుట యుక్తమా? అందుచే నీ దిక్పాలకులను, వారి భాగ్యలను దదీయపురంబులను నవలోకంచి యనంతరం బచ్చట కరిగెదము. ఇంద్రలోకంబునకు వచ్చి యింద్రునిఁ జూడక పోవుట భావ్యంబా? అదియునుఁగాక,

మ. దితిజశ్రేణి నడంప నబ్బలిని బంధింపంగ మున్వామనా
కృతి నేఁ దాల్చినయప్పు డయ్యదితి కూర్మిన్ దల్లియై యుండుటన్
శతమన్యుండు సహోదరుం డగుట నాచార్యుండు గానన్ బృహ
స్పతియున్ వంద్యులు నాకు పోవలదె వారిన్ విలోకింపఁగాన్.

మఱియు నా కారణంబున నే నాకింద్రుఁ డగ్రసహోదరుండు. అందుచే జననియగు నదితిని జూచి మవ్వల నింద్రుని జూతమురమ్ము.

సత్య—దేవా! అది యవశ్యమాచరణీయంబు. గురుజనంబులకంటె హితకార్యం బేదియును లేదుగదా! సత్వరము పోవుదము. రండు.

(అని యిద్దఱును నిష్క్రమించుచున్నారు.)

రంగము—ఇంద్రసభ.

[ఉచితపీఠమునఁ గూర్చుండి యింద్రుఁడు, యముఁడు, బృహస్పతియును నగపడుచున్నారు.]

ఇంద్రు—ఆచార్యోత్తమా! బృహస్పతులవారు.

చ. హరి కరుణారసంబుమెయి నాగతి నాబలిచక్రవర్తి ను
ద్ధురతను గెల్చి రాజ్యమును దొల్లి యొసంగిననాఁటనుండి నా
కరిభయ మింతలేదు సుఁడీ యాహరి నా కనుజుండె గాన మీ
కరుణయు శిష్యవత్సలత కారణమేగద దాని కంతయున్.

యముఁడు—అది నిజమే. అఖిలవైభవమూర్తి యగు నా బలిచక్రవర్తిని, జతుర్దశభువనకంటకుఁడగు దశకంఠుని సకలలోకశిక్షాదక్షులగు హిరణ్యాక్షహిరణ్యకశిపులను నింకను సకలలోకబాధాకరగంభీరదోస్తంభ విజృంభితులగు రాక్షసాధములను నారాయణుండు వధియించెను. ఆమహనీయుని కటాక్షంబుననే యీ సత్యలోకంబు రాక్షసబాధలేక యక్షీణసౌఖ్యంబు నొందుచున్నయది.

బృహ—ఓమహేంద్రా! ఓయముఁడా! పరాక్రమపరాయణుఁడగు నారాయణుండు కొందఱు దైత్యులను భక్తజనసులభుఁడగు నాశంకరుండు కొందఱు దైత్యులను వధియించిరి. వారిరువురు నుండఁగ భయమేల?

ఇంద్రు—దేవా! గిరిజావల్లభుం డనఁగనే జ్ఞప్తికివచ్చెనది, చిరకాలమునుండి నన్నొక సంశయంబు బాధించుచున్నయది. అద్ది యెద్దియనిన. హిమవదద్రిజనందనాధవుండగు నాశివునకు, సకలలోకరక్షాధురీణుఁడగు నామహావిష్ణునకును భేదమేమైనగలదా?

బృహ—సంక్రందనా! నీవెఱుఁగఁదలంచిన భేదము ఆకారంబుననా, వారి గుణాదులయందా?

ఇంద్ర—ఆరెండు విషయంబులం గాదు. ఆశేషశయన శేషభూషణులలోనే మహాత్ముండు భక్తజనసులభుఁడో, ఇద్దఱిలో ఘను లెవ్వరో, దైవశిఖామణి యెవ్వరో యెవని సేవించిన భక్తజనకీరవారంబునకు ముక్తిఫలంబులభించునో, యదిచెప్పవలయును.

బృహ—మహేంద్రా! క్షీరసాగరవిహారుండగు నారాయణుండు, కైలాసవాసి యగు నీశుండును, సమానులు. వారికి భేదంబులేదు. జనులు మూర్ఖులై కొందఱు శివుఁడే పరాత్పరుఁ డనియును అంతకంటె మూర్ఖులు విష్ణుఁడే పరాత్పరుఁ డనియును తమలోఁదాము వాదంబులఁబడుచు వేదనం బొందుచుందురు. విభూతిధారులవదనంబులఁ జూచిన మహాపాతకంబని వైష్ణవులు శ్రీచూర్ణధారుల ముఖంబుఁ జూచిన

దోషంబని శైవులను దలంచి నిర్హేతుకవిరోధంబుల సంపాదించి యంతంబులేని తమ మతంబులు నెలవేర్పుటకయి యింతింతనరాని దౌర్జన్యంబులఁగూడఁ జేయుచుందురు. నామరూపభేదంబులుగాని, హరిహరులకు మహిమలలో భేదంబులేదు. సకలభూషణ భూషితుండగు నారాయణుం డధికుం డనియు, శ్మశానములయందుండి నిర్ధనునివలె గన్పట్టుచుండుటచే శంకరుండల్పుం డనియు నెంచరాదు. అజ్ఞానాంధకారమునంబడి పరిశుద్ధమార్గము నెఱుంగలేక సిలుగులం బడుమనుజులను హరిహరు లిరువురుం బ్రోవఁ గలరు.

ఇంద్రు—ఆచార్యోత్తమా! ధన్యోస్మి! ధన్యోస్మి! చిరకాలమునుండి హృదయ శల్యమగు సందేహము నివారితమయ్యె.

యము—దేవా! యజ్ఞ, చయన పౌండరీక కాశ్వమేధాది మహాధ్వరంబులు విధి విధానంబునం జేయుపుణ్యాత్ములకును, జగద్భీకరరణరంగంబుల మరణమునొందు పరాక్రమాభరణులకును పుణ్యంబును రంభాసంభోగంబును గలుగునని బ్రహ్మవిధించెగదా!

ఇంద్రు—అవును అందుకు నీకు సందియ మెద్ది?

యము—ఉన్న సందియమే యిచ్చట—

బృహ—సంశయం బున్నచో నది యవశ్యముఁ దెలిసికొనవలెను. అది యేదో చెప్పుఁడు.

యము—దేవా! కామక్రోధమోహలోభాద్యరిషడ్వర్గంబులం జయించి పరిశుద్ధాంతఃకరణములతో మెలంగుచు బంధముక్తుండగువాఁడుగదా స్వర్గంబునకు వచ్చుట; అట్టివానికి మరల సంసారంబు గల్పించి రంభాసంభోగంబు గలిగించుట న్యాయమా?

బృహ—యముఁడా! ఆవిషయము చెప్పెద వినుము. ఈరంభాసంభోగంబు నాకంబునం గల లలనాబరాముల కుండుట యుక్తమేగదా! దానికి నీవొప్పుకొనుచునే యున్నాఁడవు.

యము—ఔఁ! దానికి నే నొప్పుకొనుచు నే యున్నాను.

ఇంద్రు—(తనలో) నామనంబునఁ గలసంశయంబు నిదే. ఇతఁడెట్లుదీర్చునో.

బృహ—సరే. విశ్వక్షేపకారంబుగా నధ్వరంబుల నొనరించినవారును యుద్ధంబుల మృతినొందినవారును బుణ్యాత్ములవుదురు.

యము—అవును. వారు పుణ్యాత్ములే.

బృహ—పుణ్యాత్ము లయినవారికి నంతంబున దేవత్వంబు లభించునుగదా! దేవత్వంబు లభించినవా రందఱు దేవతలేగద! దేవతలందఱికి రంభాసంభోగము

యుక్తమని నీవే వ్రాసిచ్చితివిగదా? అందుచేత సోమయాజులును యుద్ధలబ్ధమరణులును దేవతలగుటచే రంభాసంభోగంబు యుక్తంబు. అవునా? గాదా?

యము—చిత్తము. ఆమాట నిశ్చయము; సందియమువేరె. రంభాసంభోగంబు వారికి యుక్తంబు; దేవగురువు లగుటచేఁ జక్కఁగాఁ దీర్చితిరి.

బృహ—అట్టి రంభాసంభోగాఖ్యమహాసౌఖ్యము గలుగునని యేర్పడుచుటచేత నే జనులు నిజధనప్రాణవ్యయంబునకు నైనసరకుగొనక యుద్ధములఁ బోరాడి చచ్చుచుందురు. వారు మనంబులలో నిజభక్తి లేకున్నను మరణానంతరంబున రంభాసంభోగప్రాప్తి యగునని యైనను యజ్ఞములను యుద్ధములను జేయుచుందురు. ఇట్లే బ్రహ్మ లిఖింపక పోయినచో వారు యజ్ఞంబులను జేయరు. వీరు యుద్ధంబులను జేయరు. యజ్ఞనిర్వర్తనంబు లేనిచోఁ బ్రజలకు సేమంబుఁ గల్గదు. యుద్ధంబుఁ జేయనిచో జనరక్షణంబు గాదు. ఆరెండును జరగుటకయి బ్రహ్మ యిట్లు విధించెను.

ఇంద్రు—ఆహాహా! ఆచార్యోత్తమా! ఈదండధర ప్రకటితసందేహంబునకు మీయుత్తరం బత్యంతోత్తమంబై, సహేతుకమై, యానందజనకంబై, శాస్త్రప్రమాణంబునకు, యుక్తిప్రమాణంబునకును, సయిరము నిల్చియున్నది.

[అప్పుడు ఒకరాజు ప్రవేశించుట.]

రాజు—(తనలో) నేను కాంభోజదేశాధీశుండ నగు విజయదత్తుఁడ ననియు, నేనొక మహాయుద్ధంబున మరణంబు నొందితిననియు, నీయింద్రుఁ డెఱింగి, రంభాసంభోగార్థినై వచ్చిన నన్ను సబహుమానంబుగా నాదరించునా? లేదా? ఆఁ! ఆట్లేల యాదరింపకుండును. (అని దగ్గఱకుఁబోవుచు) మహేంద్రా! జయము జయము.

ఇంద్రు—నీరూపరేఖావిలాసంబులఁ జూడ నీవొక క్షత్రియునిభంగిఁ గన్పట్టుచున్నావు. అందులో నీవు మరణంబు నొందిన క్షత్రియుండవు. సకలజన వాంఛిత ప్రదాయకం బగు నాకంబునకు వచ్చితివి. నీవాంఛితం బేమి?

రాజు—మహేంద్రా! నేను యవనదేశపాలుఁడగు నగ్నివర్మ భూపాలునిచే మహాసంగ్రామంబున సంహరింపఁబడితిని. అందుచే నిటకు—

యము—జృంభితదోస్తంభగంభీరుండగు నీకాంభోజరాజు, రంభాసంభోగార్థియై శుభారంభంబగు నీయింద్రమందిరంబున కరుగుదెంచెను. అంతకంటెఁ బని యేముండును?

రాజు—దేవా! నిజముఁ బలికితిరి. నాయుద్యమం బిదియే.

బృహ.—ఆకమలసంభవ నిర్ణయపరికారంబున నీమానవాధీశ్వరునకు నామానినీ తిలకంబు నొడఁగూర్చుట యుక్తంబు. కాని యీసమయంబున నారంభ కుబేర కుమారుండగు నలకూబరుని సమక్షంబున నుండుఁగాఁబోలు.

రాజు.—దేవా! అక్షయలోకసుఖానుభవంబునకయి వచ్చిన మా కాశాభంగంబు గల్గునట్టు లానలకూబరుండు రంభోరుస్తంభయగు నారంభను దనకడ నుంచుకొనుట న్యాయంబె.

ఇంద్రు.—అత్యాదివేగంబ రాఁగలదు. శాంతింపుము.

యము.—మూఢుండా! ఏదోనిరర్థకకల్పిత యుద్ధంబున చచ్చితినని గర్వోక్తులు పలికెదవేల? పాపజన స్వర్గంబున దుర్గంధంబగు నివాసి, యుత్తర దిక్పాలక పుత్రుం డానలకూబరుం డాదరంబున రంభాసంభోగంబుఁ జేయుటకు నీయాజ్ఞయా? చచ్చిన వాఁడవు వచ్చినదాఁక నుండుము.

ఇంద్రు.—రాజా! నీయిష్టానుసారంబు గాసంభోగక్రియలం దనియుటకు రంభ నీ భార్యగాదు. మహాసంగ్రామనిహతులైన రాజన్యుల నేకు లామె సమక్షంబునకువత్తురు.

బృహ.—రాజా! సంసారం బను మహాంధకారమునుండి వెడలి మోహపాశ వినాశంబు గావించి మహేశుని వాసిగ నీమనోదేశంబున నివాసంబుంచి విరక్తుఁడవై సంభోగంబుల నుల్లంఘించుటమాఱుఁగఁ దత్తరపడుచుంటివి. మోహార్ణవ మగ్నుండవగు నీ వీ స్వర్గలోకమున కనర్హుండ వని తోఁచుచున్నయది.

రాజు.—(తనలో) అయ్యో! ఇక్కడనుండి వీరు త్రోసివేయుదురా యేమి? ఆ రంభాసంగమం బగునటకు నూఁకుండెడ. ఆమె యెట్లుండునో? నేను భూలోక వేశ్యా సుందరుల నెందఱినో సందర్శించితి; ఈమందయాన యేచందంబున నుండునో? అనంగ సంగరంబునఁ దవీయాలింగనం బెంత యానంద మొసంగునో? ఆపల్లవాధర యధర సుధారసం బెంత మధురంబుగ నుండునో! అయినను నాలోచింప నేమి కార్యము?

ఇంద్రు.—ధనాగారలాభంబు గల్గిన నిరుపేదబ్రాహ్మణుని చందంబున, మఁదుం డగు నీరాజనందనుం డమందానంద పరవశం బగు డెందంబుతో నున్నవాఁడు.

[అప్పుడు ఒక సోమయాజి ప్రవేశించుచున్నాఁడు.]

బ్రాహ్మ.—(తనలో) నేను విదర్భదేశంబున నివసించు నారాయణశర్మయను బ్రాహ్మణుండననియు, ననేక యజ్ఞంబుల విధ్యుక్తముగ నొనర్చుటచే రంభాసంభోగంబు నకు వచ్చితిననియుఁ జెప్పెద. (ప్రకాశముగా) మహేంద్రా! జయము. జయము.

ఇంద్రు.—బ్రాహ్మణోత్తమా! మీరాక యెచ్చటనుండి. ఏమిఫలంబుఁగోరి యీత్రిదివంబును మీరాకచే నలంకరించిరి.

బ్రాహ్మ—సంక్రందనా! నేఁదక్ష్యదేశవాసుండనగు బ్రాహ్మణుండను; నేను యజ్ఞము, బృహస్పతిసవనము, పౌండరీకము, చయనము, సర్వతోముఖమువాజపేయము, విధియుక్తంబుగ దానంబులతోఁ గూడఁ జేసినాఁడను. ఆకారణంబున రంభాసంభోగంబునకు వచ్చితిని.

రాజు—(తనలో) అయ్యో నానోటఁ గరకకాయ వడినది. పాపాత్ముండవగు నీ విప్రునకు నగ్రజన్ముండను మిమచే రంభను ముందుగ నొసంగుదురు గాఁబోలును.

యము—సకలవేదవేదాంగశాస్త్రధర్మమర్మజ్ఞుండవగు నీవును, నీరాజు చందంబుననే, కామావేశముతో వచ్చితివిగా?

బ్రాహ్మ—మృతిఁబొందిన యీరాజుగూడ నాకార్యమునకే వచ్చెగా?

రాజు—(కోపముతో) ఏమి! నే నెందుకు వచ్చితిననుకొంటివి?

బృహ—మహేంద్రా! ఈనరపాలధరణీసురు లేకకార్యార్థులై చనుదెంచుటచే నిర్వివాదంబుగ నీయంశంబు దీర్పఁగలయును.

రాజు—వివాదంబున కేమున్నది. ముందు నేవచ్చితి. ఆమె ముందు నన్ను సన్మానింపవలయును.

బ్రాహ్మ—అగ్రవంశజాతుండనగు నేనుండఁగా ద్వితీయవంశజుండవగు నిన్నామె యెట్లు మన్నించును. మే మాబ్రహ్మముఖమునుండి వచ్చినవారము.

రాజు—ముఖమునుండి వచ్చినవారు గావుననే నీకు దొరకునది నీమొగము.

బ్రాహ్మ—క్షత్రియులయిన మీరు చేతులనుండి వచ్చితిరిగాన, నీపని చేతులు నలుపుకొనుచు పోవుటయే.

రాజు—(కోపముతో) అనవసరప్రసంగములఁ జేసితివో శాత్రవహృదయసంతాపకరశీలంబగు కరవాలం బిదిగో!

బ్రాహ్మ—(కోపముతో) భవత్సమానరాజాధముల మహాపాతకమాత్రంబున గర్వనిర్వాపణంబుసేయు శాపాయుధం బిదిగో. మఱియును కార్తవీర్యార్జున వంశసంజాతులగు రాజాధము లెందఱు మాబ్రాహ్మణుండగు పరశురామునిచే విరామము నొందలేదు! జాగ్రత్త.

రాజు—ఓరీ బ్రాహ్మణా! ఘాతుకమృగంబుచందంబున మనుష్యసంహారణకాముండగు పరశురామునిగర్వంబు సర్వంబు మాక్షత్రియవంశంబునం బుట్టిన జగదభిరాముండగు శ్రీరాముం డడంపలేదే? మారాజుల యిండ్లలోఁ బురోహితుండవగు నీ విక్కడ నేమేమో ప్రేలెదవేమి?

బ్రాహ్మ—ఓరీ రాజాధమా! మంత్రపారగుం డగు బ్రాహ్మణుం డొకం డీయింద్రుని శపించె. అపారతపోధనుండగు మఱియొకండు శూద్రగర్భంబున జనియింపు మని యీయముని శపియించె. అట్టిదిక్పాలకశ్రేష్ఠులే శంకింపఁబడుచుండ మనుష్యుండవై మరణము నొందిన నీ వెంత.

రాజు—నేనెంతో నా ఖడ్గంబు తెలుపును; నీవెంతో నీదర్భాసనమును తెలుపు మనుము.

బ్రాహ్మ—దర్భాసనముగాదు. మంత్రప్రోక్తమగు నొక్కదర్భ చాలును. నీ ఖడ్గంబులవంటివి దానిముందఱ దిగదుడుపులు పెట్టవలెను.

ఇంద్రు—బ్రాహ్మణోత్తమా! శాంతింపుము; రాజపుంగవా! యూరకుండుము. మరణానంతరంబునఁ గామాతురత గల్గినందుకు సిగ్గుపడక మహాకలహాసక్తులయి ప్రచండకోపోద్దీపితులయి యిట్లు వివాద మాడ నేల? ఆవివాద మేను దీర్చెద.

బృహ—మహేంద్రా! ఆరంభను బిలిపించి ప్రథమమున నామె యెవరి నంగీకరించునో తదభిప్రాయ మరయుట యుక్తము.

ఇంద్రు—అవును. ప్రతీహారుఁడా! ఆరంభను మదీయసభామండపంబునకుఁ దోలుకొని రమ్ము.

యము—(బృహస్పతితో) దానికంటె శాస్త్రోక్తప్రకారంబుగా ఆపురుషుని మనమే యేర్పఱుచుట యుక్తము.

బ్రాహ్మ—(తనలో) ఆరంభ యెట్లుండునో, నిరంతరమును గుసగుసలాడు మా సామిదేవరవలె నుండదుగదా! అమెయిల్లెక్కడనో, నేనీస్వర్గలోకంబునకు వచ్చుచు మార్గంబున నామెస్వరూపంబును జూచి యీరాజాధముం డెఱుంగకుండ, నామెదగ్గఱకుఁ బోయి రావలసినది. అప్పుడు వాఁ డేమిచేయునో, ఐనను బృహస్పతి నాపక్షము బల్కఁడా? మే మిద్దఱము బ్రాహ్మణులమేగదా?

బృహ—(ఆలోచించి) ఈస్వర్గలోకమునకు మొదట వచ్చినవాఁ డీరాజసుతుండు, కాని అగ్రకులమునం బుట్టినవాఁ డీవిప్రుఁడు. ఒక్కొక కారణంబున నొక్కొక రధికులయి యున్నారు. ఎట్లయినను అగ్రవంశసంజాతుఁ డగుటచే నా బ్రాహ్మణున కీసరసీజాతనేత్రను మొదట నిచ్చుట యుచితము.

రాజు—(విచారముతో) ఓదేవగురూ! యీస్వర్గలోకంబునకు మొదట వచ్చినవాఁడను నేనుగదా! నేను వచ్చుటతోడనే ఆయిందీవరదళనేత్ర యిచ్చటనుండినచో నాకామె చేకురునుగదా! ఇట్లుగాక నలకూబరసమీపమున నుండెనని మీరాటంకపఱచితిరి. ఆలోపంబు మీదా, నాదా? అయినను యీపఱకు జాతియే ముఖ్య

ముగఁ జూచుటలేదు. ఎట్లనిన ప్రపంచారంభము గాఁ బెక్కు వత్సరములనుండి మ్లేచ్ఛ కిరాత, పార్వతీయాదిహీనజాతులవారు సయితము, రణరంగనిహతులయి యీబ్రాహ్మణునికంటె ముందు రంభను, గూడిరా, లేదా? అక్కడజాతియేది? తరువాత నీమూర్ఖుఁ డామె నంగీకరించునా లేదా?

బ్రాహ్మ—వెనుక జరిగినవృత్తాంతములసంగతి యేమిటికి? ప్రస్తుతాంశనిర్ధారణము చేయవలయును.

బృహ—మహేంద్రా! అత్యంత ధర్మసూక్ష్మసమేతం బగు నీయంశంబున నాకేమియుఁ దోఁచకున్నయది.

ఇంద్రు—అందుకే నేను దీర్ఘాలోచన సేయుచున్నాఁడను. అస్మదాచార్యులగు మీకే తోఁచనప్పుడు నిరీశ్వరుఁడనగు నాకా తోఁచుట.

భృత్యుడు—మీయాజ్ఞచొప్పున రంభ యిదేవచ్చుచున్నయది.

[అప్పుడు రంభ వచ్చుచున్నది.]

రంభ—(తనలో) నలకూబరునకుముందుగానున్న నన్నా యింద్రుఁ డత్యంతావశ్యకముండినఁ గాని పిలిపింపఁడు. అదియేమో కనుఁగొనవలయును. (ప్రకాశముగా) మహేంద్రా! విజయము గుఁగాక! విజయముగుఁగాక!

బ్రాహ్మ—(లేచి తనలో) ఇంద్రసభామండపమున కరుగుచున్న యారంభకు నే నెదురుగాఁ బోయెదను. (అని యెదురుగాఁ బోయి) కాంతా! రంభవు నీవేనా?

రంభ—(వినిపించుకొనక ఇంద్రుని దగ్గఱకుఁ బోవుచున్నది.)

ఇంద్రు—ఓనాకలోక వేశ్యకాంతాలలామా! ఈరాజపుంగవబ్రాహ్మణోత్తములు భవన్నిమిత్తము వచ్చియున్నవారు. వారికి నీయభీష్టము లొసఁగి తనుపుము.

రంభ—ముఖము ముడుతలుపడిశల్యచర్మావశిష్టుఁ డయిన యీశిష్టబ్రాహ్మణునికిఁగూడ కామము పేక్షయే? కాలిపోయిన చెట్టు మరలఁ జిగుర్చునుగాఁబోలును?

బ్రాహ్మ—నన్నీ వేశ్యకాంత నిందాస్పదముగాఁ జూచుచున్నది. ఎట్లయినను ఇది నన్నొల్లక తప్పదు. ఓసి రంభా! తాంబూల మియ్యవే?

రాజు—(తనలో) ముందీపాపాత్మునకే తాంబూల మొసఁగునాయేమి?

రంభ—సోమయాజులవారూ! భవజ్జన్మకాలమధ్యంబున నెన్నఁడైన తాంబూలము గనుఁగొంటిరా లేక విన్నారా? మఱియును మీరు వేదాధ్యయనపరులు పరమచ్ఛాందసులు అదిగాక "వైదికునిచేతి విడెమూరామె వనితబ్రతుకు" అని లోకోక్తి గలదు. దానినిబట్టి తాంబూలోపయోగంబులును, దాని లక్షణంబులును, తద్రుచియును, దాని శృంగారంబును మీ రెఱుంగరు.

బ్రాహ్మ—(కోపముతో) వేదవేదాంగపారంగతుండనయిన నే నెఱుంగనిచో నీకా జ్ఞానముం డెఱుంగునాయేమి ?

రాజు—నాప్రశంస నీ కేటికి ? నీవిషయమై నీవు చెప్పుకొనుము. (తనలో) నాకడ్డువచ్చిన యీధనరామ రాధముని, యీరంభ చేరనియ్యదని తోఁచుచున్నయది. (ప్రకాశముగా) రంభా ! నావిషయమయి యేమి చెప్పితివి ?

రంభ—రాజా ? రంభాసంభోగార్థమై నీవు చావవలెనని వచ్చినట్టు తోఁచుచున్నయది. బ్రాహ్మణోత్తముని బెదరించుట యయినదా ?

రాజు—ఆబ్రాహ్మణబ్రువుని నేను బెదరించెదుననదేమి ?

బ్రాహ్మ—నీవుమాత్రము క్షత్రియబ్రువుఁడవు గావా ? అధమా ? ప్రేలకుము.

రంభ—(తనలో) ఈసమయంబున వీర లన్యోన్యనిర్మూలనము చేసికొనినచో వివాదము పరిపూర్తిఁగాయగును.

యము—(కోపముతో) ఓమహేంద్రా ! ఓయాచార్యా! అత్యధిక రోషభీషణాకారులయి, దూషణభూషణంబులచే నన్యోన్యగర్వశోషణంబు చేయుచున్న యీవేషధారుల వివాదంబులను నేనిమిషమాత్రంబున తీర్చెద.

ఇంద్రు—ముఖ్యముగాఁ జేయవలసినదే.

బృహ—ధర్మాధర్మవివేచన సామర్థ్యముగల నీకిది యొక కష్టముగాదు.

యము—ఓయి బ్రాహ్మణా! ఓయి రాజా! మీరు భూమండలంబున జీవితులయియున్న కాలంబున నేయేయవసరంబున నేయేధర్మకార్యాచరణం బొనరించి పుణ్యసంపాదనంబు చేసితిరో, యేయేధర్మవిరోధ కార్యావలంబనులయి దోషసంపాదన మొనరించితిరో యీవఱకును విచారింపలేదు. అందుచే మాకుఁ బరమాప్తుఁడగు చిత్రగుప్తుని సముఖంబున కరిగి పాపలేశంబుండినఁ దన్నియమితనరలోకబాధల ననుభవించి తదనంతరం బిచ్చటికి రండు.

ఇంద్రు—యముఁడా ! చక్కని తెరవు పూహించితివి. వేగమే పోయిరండు.

బ్రాహ్మ—(తనలో) అయ్యో ! రంభాసంభోగప్రాప్తియగునని ధనవ్యయము చేసితిని. లేకున్నచోఁ జేయకపోదునే.

రాజు—(తనలో) రంభాసంభోగప్రాప్తి యగునని యుద్ధంబునన్వైతుకముగాఁ జచ్చితిని. లేకున్న బ్రతికియుందునే ! యుభయభ్రష్టత్వమయినది.

(అని యిద్దఱు నిష్క్రమించుచున్నారు.)

బృహ—ఇట్లు ధర్మసూక్ష్మవిచారణ సేయునపుడు సకలలోకవరిష్ఠుఁడగు శ్రీకృష్ణుఁ డత్యంతచాతుర్యగాంభీర్యంబుల మెలంగుచుండునని వినుచుందుము. అట్టి బుద్ధిశాలుఁడే యిట్టిది తీర్పవలయును.

ఇంద్రు—ఇందిరామనోహరుఁడగు నయ్యరవిందనాభుఁ డీసమయంబున నిం దుండిన బాగుండును.

[అప్పుడు శ్రీకృష్ణుఁడు, సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృష్ణు—దేవీ! వామనావతారసమయమున మాజననీజనకులగునదితి, కశ్యపులను, వరుణ, కుబేర, పావక, నిర్‌ఋతీశాన, వాయువులను, సందర్శించితిమిగదా! ఇదిగో నచ్చట యను బృహస్పతి సమేతుఁడై సంక్రందనుఁడు కొలువుదీర్చి యున్నవాఁడు.

సత్య—ప్రాణేశ్వరా! నవరత్నఖచితసింహాసనాసీనుఁడై కాంచనకిరీటశోభితుఁడై యాయుధము ధరించిన యామహానుభావుఁ డెవఁడు.

కృష్ణు—ఉ. అతఁడె ప్రాగ్దిశాధిపతి యాతఁడె నిర్జరలోకనాయకుం
డాతఁడె ముజ్జగంబుల మహావిభవంబున నేలుమేటి సు
మ్మాతఁడె కొండరెక్కల నిజాయుధధారలఁ ద్రుమ్మరీఁడఁడౌ
నాతఁడె వందనీయుఁ డగు నంబుజలోచన! నీకు నాకునున్. 5

సత్య—సరే. ఆమహేంద్రుని దక్షిణభాగంబున, అంజనశ్యామలాకారుఁడై చేత దండంబు ధరించిన యాతఁ డెవ్వరు?

కృష్ణు—చ. అతఁడు మహానుభావుఁ డగునట్టి యముండు, దినేశసూతి య
ప్రతిముఁడు ధర్మశాస్త్రము లపారముఁ జూచినవాఁడు పాపసం
గతు లగుదుష్టచిత్తులను నారకకూపములందుఁ ద్రోసి బల్
వెతలను బెట్టు నీఘనుని పేర్కొనినన్ జగముల్ వడంకెడున్. 6

సత్య—సరే. ఆమహేంద్రుని వామభాగంబునఁ గూర్చున్న యామునుకఁ డెవ్వరు?

కృష్ణు—చ. మునుకఁడె గాని యత్యనఘమూర్తిన్ సుపర్వగురుండు నీతిసం
పద నితఁ డద్వితీయుఁ డని పద్మభవాదులు మెచ్చుచుందు రా
త్రిదశవిభుండుఁ దక్కఁగల దివ్యులు నీతనియాన మౌళి దా
ల్చెద రన వీనిసన్మహిమఁ జెప్పఁగ నెవ్వటికి వేర సుందరీ! 7

సత్య—నాథా! వారి సన్నిధినున్న యాబోఁటిమిన్న యెవరు?

కృష్ణు—అదియే! రంభాస్తంభోరువగు రంభ; నాకలోకవేశ్యాకాంత.

సత్య—జితేంద్రియులగు దేవతాశ్రేష్ఠులకుఁ గూడ వేశ్యాకాంతలు గావలెనా?

కృష్ణు—వారికే నరులకంటె నధిక కామంబులు భోగంబులు కావలెను.

రంభ—దేవా! సత్యభామాసమేతుఁడై శ్రీకృష్ణుఁడు భవద్దర్శనార్థమై వచ్చుచున్నవాఁడు.

ఇంద్రు—(అదరిపడి) ఏమీ! లావణ్యసీమయగు సత్యభామయు సకలభువన వరిష్ఠుఁడును నాకృష్ణుఁడును నాదర్శనార్థమై వచ్చిరా? ధన్యోస్మి! ధన్యోస్మి! ఓఆచార్యోత్తమా! ఓయముఁడా! మన మాయాదవేంద్రు నెదుర్కొందము రండు.

బృహ—ముఖ్యముగా నట్లు చేయవలసినదే!

యము—సకల భూతాంతర్యామియు కేవల మాయామయాకారుం డగు నామాధవుండు మనకడ కరుదేర మన మెదుర్కొనుట యెంతపని.

[అప్పుడు కృష్ణుఁడు సత్యభామయు దగ్గఱకు వచ్చుచున్నారు.
ఇంద్రాదు లెదుర్కొనుచున్నారు.]

కృ—దేవా! సంక్రందన! ఓనిర్జరాచార్యా! ఓదండధరా! మీకు ముప్పురకుఁ బ్రణమిల్లుచున్నాఁడను.

బృహ—ఈప్సితార్థ సిద్ధిరస్తు.

ఇంద్రు—దేవా మాధవా! మాకును శంకరపంకజనాభులకును వందనీయుఁడవగు నీవు మాకు నమస్కరించుట భావ్యంబే?

కృష్ణ—ఓత్రిలోకాధినాథా! నేను శ్రీ వామనావతారధారి నైనప్పుడు నాకగ్రసహోదరుండవగు నీవును నాకాలంబున సకలనీతిశాస్త్రంబులం గఱపుటచే గురుఁడు గావున నీబృహస్పతియు నవ్యవసరంబున నిఖిలధర్మాధర్మవిచారణ సామర్థ్య బొసంగుటచే నీయముండును నాకు వందనీయులు; కాని దిక్పాలకాచార్యసమేతంబుగా నీకు నేమంబేగదా!

ఇంద్రు—దేవా! అమర రక్షణమునకుఁ గంకణముఁ గట్టుకొని నీవుండ నేమమునకు లోపమేమి? ఆపీఠంబులఁ గూర్చుందము రమ్ము. అమ్మా సత్యభామా! నీవుఁగూడ రమ్ము. (అందఱు కూర్చున్న తరువాత)

యము—దేవా! శ్రీమన్నారాయణ! ఆదికాలంబున క్షీరపారావార విహారపారాయణుఁడవై సకలలోకసౌఖ్యదాయకుండవై వటపత్రశాయివై యోగనిద్రావశక్తచిత్తుండవై రామాపంకజగంధీసమన్వితుండవై యుండి। సకలనిర్జరగణప్రార్థితుండవై జగత్సంబాధకరదనుజలోకదారణకేళీలోలుఁడవై శ్రీవత్సాఖ్యమంగళ లాంఛనంబుతోడను దేదీప్యమాన ప్రభాసమన్వితకౌస్తుభమాణిక్యతల్లజంబుతోడను నిజఘోషణమాత్రసంత్రస్తదానవమండలంబగు పాంచజన్యంబుతోడను నవ్యవిక్రమంబగుసుదర్శనచక్రంబుతోడను నిజఘాతచూర్ణిత దానవప్రశస్తమస్తకంబగు కౌమోదకీగదా దండంబుతోడను ఆత్మీయజ్యానాదబధిరితకకుబంతదంతావళంబగుశార్ఙ్గంబుతోడను నందకకరవాలంబుతోడను శ్రీమద్దేవకీగర్భదుగ్ధపాథోధిచంద్రుండవై అపరమిత కరుణారససాంద్రుం

డవై యాదవేంద్రుండవై జనియించి జరాసంధ శిశుపాలదంతవక్త్రాది రాక్షసాంశ సంభూతుల వధియించితివి. శిష్టజనపాలన దుష్టసంశిక్షల చేయుచుంటివి. నీమహామహిమంబు నెన్న నెవరితరంబుగాదు. నాకు శక్యంబె?

కృ—ఓయముండా! నీకు మాయం దపరిమిత ప్రేమ గలదు. ఓసత్యభామా! యీకాలుండు మనకు పరమాప్తుండనుమా!

సత్య—దేవా! మహానుభావులగు దేవరవారికి నాప్తులుగానివారెవ్వరు? త్రిలోకపూజ్యులయిన యీదిక్పాలకాదులచేఁ బూజింపఁబడుచున్న మీరెంతవారని నేనూహింతును. మామధ్యంబున మనుష్యమాత్రులవలె సంచరించుటచే మీమహిమ గ్రహింపలేము.

బృహ—'అమ్మా' నీవు చెప్పినదంతయు నిశ్చయము (యింద్రునితో) మహేంద్రా! యీమహానుభావు నెవ్వనిగా భావించుచుంటివి; చూడు.

సీ. భువనముల్ పదునాల్గు బొజ్జనిల్పినవాఁడు యోగుల మదులందు నుండువాఁడు
విరిదమ్మిమొలచిన వెడఁద పొక్కిలివాఁడు కడపార నలువను గన్నవాఁడు
కారుమబ్బుల నేయ కతిమేనిజిగివాఁడు కాలభేదముఁ దెల్పుకనులవాఁడు
నదితిగర్భమునందు నవతరించినవాఁడు తెఱంటులను నేలు దిటువాఁడు
నెచటనున్నను తెలిపీవి యిల్లువాఁడు
విశ్వమున కెల్ల రక్షయౌ విల్లువాఁడు
నమృతవార్ధికి గారాబుటల్లుఁవాఁడు
మత్తచాణూరుఁజంపిన మల్లువాఁడు.

బృహ—కతఁడు నీమహానుభావుం డాదిమధ్యాంతరహితుండును, గుణరహితుండును, కేవల తేజోమయమాయాకారుండును, జననభరణమరణహేతుభూతుండునై యున్నవాఁడు. ఓమహేంద్రా! యేమహానుభావుని కనుఁగొనుటకై జ్ఞాను లధ్యాత్మవిద్యాభ్యాసంబుచేయుదురో, యేలోకపూజ్యునిఁ జూచుటకై జపతపస్స్వాధ్యాయంబులు పుణ్యమంత్రోచ్చారణంబులు యజ్ఞంబులు దానంబులు పుణ్యకర్మంబులు గంగాది పుణ్యనదీ స్నానంబులు పుణ్యస్థల సందర్శనంబును సకలదేవతాసేవనంబును సేయుచుందురో యెవని తేజోమాయాకార సందర్శనంబుచేసిన అనంతపదము చేకూరునో అట్టి చరాచరాత్మరుండును బరాత్పరుండును జ్ఞానమయుండును మనకు ప్రసన్నుండయ్యె. అందుచే జన్మము పావనంబయ్యె; ఈనాకలోకంబు వన్నెకెక్కె.

ఇంద్రు—అవును, ఈయిందిరామనోహరుండు;

ఉ. బాలురలోన బాలుఁడయి పాడుచు నాడుచు నుండు వేడ్కతో
నాలమునందు వీరుఁడయి యంతముఁ జేయును శత్రువర్గముల్
తాలిమి కన్యకామణుల దగ్గఱఁ దా, రసికాగ్రగణ్యుఁడై
లీలల నెన్నఁగా దరమె లేఖకు లందఱు నెంచఁజూచినన్ ?

(కృష్ణునివంకఁ దిరిగి) ఓ మాధవా !

చ. అలబలిదాడి కోడి యమ గావళి విహ్వాల మంది పాట వే
ల్పులఁ గరుణింప నయ్యదితి పొత్తులబిడ్డఁడవై జనించి యో
నళినదళేక్షణా పెఱిగినాఁడవు మాగృహమందుఁ గ్రిమ్మఱన్
జెలిమిని మాగృహంబునకె చేరితి వుండుము కొన్నినాళ్ళిటన్. 19

కృష్ణ—మహేంద్రా! నీవు నన్నింత సంభావింపవలసిన పనిలేదు. ఏలయన

ఉ. ఎవ్వనియూరునన్ పశువులేనియు దానము లీయ నేర్చునో
యెవ్వనివీట వాఁసము లేనియు యాగఫల బు లిత్తురో
ఎవ్వఁడు దాల్పఁగా నెముక యేనియు వజ్రపుతున్కయౌనో యేఁ
డప్పిబుధేంద్రుఁ గంటిమిక మాసుకృతంబు నెంపునన్. 11

ఇంద్రు—యాదవేంద్రా! నీవు మమ్ము ధన్యులఁ జేయవచ్చిన కారణ మేమి ?

కృష్ణ—సంక్రందనా !

ఆ. వె. నాకమునకు వచ్చి నరకాసురుఁడు తొల్లి
యమరకోటి గన్నఁ యదితిదేవి
కుండలముల నెత్తుకొనిపోయె నవి యిప్డు
తెచ్చినాఁడఁ దల్లి కిచ్చుకొఱకు. 12

బృహ—నరకాసురుఁడు సంహరింపఁబడియెనా ?

కృష్ణ—మీయనుగ్రహముచేత !

ఇంద్రు—అమరకోటి కమితోపకార మొనర్చితిరి.

యమ—ఇది మొదటిసారి గాదు.

సత్య—ఈమహాత్ముని రాకకు నాప్రేరణముఁ గూడ కొండొక కారణ మయి యున్నయది.

కృష్ణ—అవును ; ఈనాకనదీపుతల్లికను, మీనందనవనమును, శచీదేవిని సందర్శింపఁగోరి సత్యభామ నన్నీలోకమునకుఁ బయనముఁ జేసినది.

ఇంద్రు—ఏ కారణమున నయిన నేమి ; యీమహాత్ముఁడు రాకచే నాకనుపండు వొనర్చె మీయభీష్టము నిర్విఘ్నముగా నెఱవేఱుఁ గాక !

బృహ—దేవా! ఇంద్రమందిరంబున కరిగి పూజ్యులగు నదితికశ్యపులం జూతము రండు.

కృష్ణ—మన్నింపఁదగిన గురుజన బంధుగణంబుల నందఱ నిదివఱకే సందర్శించితి.

ఇంద్రు—అట్లయినఁ దక్కు విశేషంబులం జూతము రండు.

సత్య—ప్రాణేశ్వరా! నాకలోక వేశ్యాకాంతయగు నీరంభ నృత్యగానంబుల యందు నెఱజాణయని విందును. అందుచే నీమె నృత్యగానంబులు కనవినవలయు.

ఇంద్రు—అమ్మా దానికేమిభాగ్యము, ఓసీ రంభా! నీనాట్యము, గానము ధన్యత నొందుకాలము వచ్చినది. ఈమహాత్ముల మెప్పింపుము.

రంభ—మీ రామాత్రపుమాట నందురాయని కనిపెట్టుకొనియున్నాను. ఇట్టి మహారసికులు చూచి మెచ్చనియెడల నావిద్య యెందుకు? ఇదె యారంభించుచున్నాను. (అని యాడుచున్నది.)

కృ—(ఆట అయినతర్వాత) యెన్నఁడును గని విని యెఱుఁగని నృత్యగాన వినోదంబులు, స్వర్గలోక వాస్తవ్యులగు మీకు భూలోక వస్తువులయం దిష్టముండదు. కాని, యీహారము నీవు బహుమానముగాఁ గైకొనుము. (అనిరంభ కిచ్చుచున్నాఁడు.)

సత్య—నీ విద్యావైభవంబులకుఁ దగిన బహుమానము గాకున్నను దీనినిఁగూడఁ గైకొనుము. (రంభ కిచ్చుచున్నది.)

రంభ—ఈబహుమానంబులు శిరసావహింపఁదగినవి. ఏలయన, మీరిచ్చుటచేత.

కృ—మహేంద్రా! నందనవనంబు సందదర్శింతము రమ్ము. యముఁడా! కొలువు చాలింతమా! ఆచార్యోత్తమా! సెల వొసంగెదరా? దేవా పోవుదమా!

అందఱు—చిత్తము.

(అందఱు నిష్క్రమించుచున్నారు.)



శ్రీ

# పారిజాతాపహరణము.

## పంచమాంకము.

పరిదేశము—నందనవనము.

[అప్పుడు శ్రీకృష్ణుఁడు సత్యభామయుఁ బ్రవేశించుచున్నారు.]

కృష్ణు—దేవీ! సర్వసౌఖ్యాకరంబగు నీనాకలోకమున నిన్నటిరాత్రియంతయు నపూర్వసుఖనిద్ర లభించినది ఎందుచేతనన,

తే. గీ. దేవతోద్యానవనమందుఁ దిరిగి తిరిగి
కలఁగి మిన్నటితరఁగలఁ గలిసి మెలసి
మలయమారుతుఁ డరుదెంచి మందగతుల
మెల్ల జోకొట్టినట్టులు మేను సోఁకె. 1

ఇట్టి యానందము భూలోక దుర్లభముగదా!

సత్య—అవు నది నిజమే. కాని యిప్పుడు మన మున్నదే పరిదేశము?

కృష్ణు—దేవీ! ఈప్రదేశము చెప్ప నక్కఱలేకయే తెలిసికొనఁదగినది.

ఉ. నందన మీవనం బదితినందన సేవ్యము నిర్జరేశ్వరుం
డిందు శచీసమేతుఁ డయి యెల్లపుడున్ విహరించు నిందె యా
చందనపారిజాతముఖసారకుజంబులు నిల్చియుండు దై
నందిన వైభవం బమరనాథునకున్ సమకూర్చు నెప్పుడున్. 3

సత్య—అట్లయిన సత్వరమాపారిజాతమహీరుహముకడకుఁ బోవుదము రండు.

కృ—దేవీ! ముహూర్తమాత్ర మీయమరలోకనందనవనవైచిత్ర్యములఁ జూచి యనంతరము పారిజాతముకడ కరిగెదము. ఇందు మందారహరిచందనసంతానాదిదేవభూరుహకుసుమసౌరభంబును సరోవరారవింద మకరంద పానమత్తేందిందిరఝంకారంబులును ఘ్రాణేంద్రియంబునకును కర్ణద్వయంబునకును నేత్రయుగంబునకును నొక్క పర్యాయమే విందొనర్చుచున్నవి.

సత్య—ఈవనరామణీయకము నీతరువులసొబగు నెంత చూచినను దనివి దీఱ కున్నయది.

కృ—సుందరీ ! అందుచేతనే నిర్జరులు దీని కంతఁ గాఁ గూర్తురు.

తే. గీ. అవనిజంబులు పూచు దోహదము లేక
యాఱుఋతువులఁ బువు లుండు నన్ని చెట్ల
వేలుపులఁ బోలె నిందలి వృక్షములును
ముదిమియును జావు లేకుండ బొదలుచుండు. 3

సత్య—దేవా ! మీప్రసాదమున నాకిట్టివైచిత్రములఁ జూచుభాగ్యము లభించి నది. నాతొందరకు క్షమించి నన్ను సత్వరము దివిజభూరుహముకడకుఁ గొంపొండు.

కృ—దేవీ ! అట్లే చేయుదును. (అని కొంత నడిచి) ఇదిగో ! కల్పవృక్ష వాటియొద్దకుఁ వచ్చినారము.

సత్య—దేవా! భూలోకమహీరుహములకంటె నెంతయును సుందరమైదర్శనీయ మయి యున్న యావృక్షరాజము పేరేమి?

కృ—సుందరీ !

క. కల్పము నందనమునకా
కల్పము సఫలీకృతసురగణమానస సం
కల్పము వెలసెను నిది బహు
కల్పంబులనుండి నిర్వికల్పంబగుచున్. 4

సత్య—నాజీవిత మింత కాలమునకుఁ జరితార్థత నొందినది. తక్కినమ్రాఁకులఁ గూడ నెఱిఁగింపుఁడు.

కృ—ఎఱిఁగించుచున్నాఁడ వినుము.

మ. అది బృందారకసుందరీనిరతసేవ్యంబైన మందార మ
య్యది సంతానకుజంబుఁ దత్తరువుచాయం దేవసంతానముల్
మది నానంద మెలర్ప నిల్చెదును లేమా చూడు మామ్రాకు ప్ర
క్కదె సుమ్మా హరిచందనం బిదియె సింగారం బిడుందోఁటకున్. 5

సత్య—(నవ్వుచు) నాలుగు మ్రాఁకుల నామములు మాత్రమే నాకెఱిఁగించి యైదవదానిం దలపెట్టరేమి?

కృ—కళ్యాణీ! నీ హృదయంబునం గల తొందరచే నీ వట్లనుచుంటివి గాని నేను క్రమక్రమంబున నెఱిఁగించుచునే యున్నాను. విను.

మ. నెలఁతా ! యయ్యదియే విదర్భసుతకున్ నీకున్ మనస్స్థలన్,
గలుగంజేసినపారిజాతము స్వరాట్ప్రాణసంవర్ధకం

బెలఘుశ్రీయుత మాలతాంతము లెప్పౌన్నె బంతియై హారమై
కలపుల్ జిమ్ముచు నిండుమోద మిడు నాహా లోకకాంతముల్. 6

సత్య—(తొందరతో) ఏదీ నామనోరథంబును, నాయానందంబును, నాకును విదర్భరాజనందనకును గలహకారణంబును నగు మహీరుహంబు.

కృ—అదిగో (అని దగ్గరకుఁ బోయి) నారదమునిదత్త పారిజాతపుష్పం బొక్కటి దొరకుటయే దుర్ఘటం బయ్యెను; ఇప్పుడు నీమనోరథసాఫల్యం బగునట్టులు కావలసినన్ని పుష్పంబుల ముడుచుకొనుము.

సత్య—దేవా ! నామనోరథం బట్లు సఫలముగాదు. ఈవృక్షంబు మదీయ మందిరోద్యానవనంబునకుఁ దీసికొనిపోవలయును.

కృ—(తనలో) ఈమెతో నిప్పుడు పరిహాసంబు గావించెద. (ప్రకాశముగా) అబ్బా ! ఈమహీరుహంబు నేమి ! నే నేమి ! తెచ్చుటయేమి ! దీనినిఁ గొంపోవుటకు నాదేవేంద్రునియనుజ్ఞ వేఁడవలయు. అట్లు చేయుదమా ?

సత్య—(సంతోషముతో) వేఁడినచో సమితసౌఖ్యదాయకం బగు దీనిని నాతఁ డిచ్చునా ?

కృ—ఇయ్యఁడు ! ఆమాట నిజమే. అందుకేమి చేయఁగలము ? పోనీ నీమనోరథసిద్ధి యగునట్లు కావలసినన్ని నీతుఱుమునఁ దుఱుముకొనుము.

సత్య—అంతమాత్రమున నామనోరథసిద్ధి పూర్తి గాఁదీరదనియేగదా! పోనిండు. ఆదేవేంద్రు ననుజ్ఞఁ బొందనేల ? ఆతఁ డెఱుంగకుండ రహస్యముగాఁ దీసికొని పోవుదము.

కృ—(ఆశ్చర్యము నభినయించి) ఏమి ! దొంగతనము జేయుమని చెదవా ? ప్రాణేశ్వరుండు దురాచారవర్తనుండైనపుడు కులకాంత తనసుభగనీతివాక్యంబులచే నది మాన్పవలె. అట్లు చేయుటకుమాఱుగా, నీవు మముఁ జౌర్యమునకుఁ బురికొల్పుచుంటివి. ఇది నీకు భావ్యమా ?

సత్య—(నవ్వుచు) ఏమి ! మీ నంగనాచితనము, దొంగతనం బెఱుంగనివానివలె నభినయించుచుంటిరి. బాల్యకాలమున గోపికాగృహంబుల దధి క్షీర నవనీతంబుల దొంగిలించుట మీకలవాటే గాదు. దొంగతనము ముందును, తర్వాత మీరునుఁ బుట్టితిరి.

బాల్యావస్థల నెన్ని చేసినను జెల్లును. పూర్ణయౌవనప్రాయంబువచ్చి నప్పు డాగట్టిచేఁతలు చెల్లునా ? పోనీ, భవత్కార్యనిర్వహణంబునకయి దొంగతనమున కంగీకరింతమన్నను త్రిజగద్భీకరపరాక్రమసాంద్రుఁడగు నాదేవేంద్రుఁడు మనలఁ బట్టికొనునుగదా ! నేనందుకె జడియుచున్నాఁడను.

సత్య—(విచారముతో) దేవా! చక్రాయుధశోభితప్రశస్తహస్తులగు దేవర వారిపరాక్రమముముందర దేవేంద్రుఁ డెంత? మీరిట్లు పరిహాసార్థమై నన్నుఁ వలసి యనియెదరుగాని నే నెఱుఁగనా? అదియునుగాక నాఁడు నాతో, మీరిట్లనలేదా! "ఆయమరలోకంబున కరిగి సమీర, సమవర్తి, సముద్రేశక, సర్వభక్షాదులగు దిక్పాల కులం గూర్చుకొని యా దేవేంద్రుఁ డడ్డము వచ్చినను వచ్చుఁగాక!

ఉ. మానవతీవిభూష విను మాట లిఁకేటికి నీవు మెచ్చి యా
నా నన నాకశీరమణి యచ్చెరు వంద వడంక ముజ్జగం
బే నమరావతీపురికి నేగి చోరంబడి యింద్రనందనో
ద్యానము పారిజాతవసుధారుహము న్గొని తెచ్చి యిచ్చెదన్. 7

కృ—(నవ్వుచు) నాపరాక్రమమునకు నీవే మెచ్చుకొనవలయును. ఆఁడుదాని యెడమకాలిచేఁ ద్రోయఁబడినవానికి పరాక్రమ మెట్లుండు?

సత్య—(తలవంచి) ప్రాణేశ్వరా! క్షమింపుఁడు.

కృ—దేవీ! క్షమార్పణ కేమున్నది? అదిగాక యారంభకాలమునఁ బ్రజ్ఞలఁ జేయుట సుకరము! నెఱవేర్చుట దుష్కరము. తెచ్చెద ననఁగా నిరపాయమయిన యుపాయము గల్గినఁ దెచ్చెదనని గాని వీలు దప్పినచో నేమి చేయుదును?

సత్య—(కన్నీళ్ళతో) ఈయాటంకము లప్పుడే చెప్పకపోతిరా? రాకుందునే? అప్పుడు నిరర్థకప్రజ్ఞలఁ జేయనేల?

కృష్ణు—అయ్యో! విచారించిన నేమి కార్యము?

సత్య—విచారముగా యీసత్యభామ ముఖమునకు నానంద మెప్పుడు?

కృ—అందుచే నీమహోత్సవపరిపూర్తిన్ యగునట్లును నాకు నిర్బాధక మగునట్లును నొక యుపాయముఁ జెప్పెద నది యెద్దియనిన యీపారిజాతమహీరుహంబు నిందే యుంచి యనుదినమును శతసహస్రపుష్పంబుల నీకుఁ దెచ్చునట్లు గరుత్మంతున కానతిచ్చెదను. అది సమ్మతమా?

సత్య—(శృంగారసముచితంబుగ నేడ్చుచు) ప్రాణేశ్వరా! యిది మీకు యుక్తమా? అట్లు పారిజాతవృక్షమును దెచ్చి మదీయ బృందావనంబు పెఱటిచెట్టుగా నాటింతునని చెప్పలేదా? యిప్పు డిట్లననేల? ఈపారిజాత మహీరుహంబు దెచ్చుకొందునని రుక్మిణి, జాంబవతి, మిత్రవింద, కాళింద్యాదులతోఁ బీరములువలికి వారినధిక్షేపించి వచ్చితిని! అప్పుడట్టి యట్టహాసంబుచేసి యిప్పుడు దీని దీసికొనక రిక్తహస్తములతోఁ బోయిన నాసవతులు నన్నవమానింపరా? ఆయవమానమ్ము నే భరింపఁగలనా?

ఈవృత్తాంతము నాకు ద్వారకానగరంబుననే మీరు చెప్పినచో రాకుండ నొకమా రచ్చటనే వగచి యూరకుందునుగదా.

కృ—నీ వొకపర్యాయము శిక్షించితివి గాన మఱల యథాపూర్వకముగాఁ జేయుదు వన్న భయముచేత నట్లంటిని.

సత్య—(ఏడ్చుచు) జీవితేశ్వరా! మీపరిహాస వచనముల నడఁచి నాకు దలఁచిన మహాపరాభవ సముద్రమునుండి దాఁటించి రుక్మిణితో సమానగఁ జేయుఁడు.

కృ—(తనలో) ఈకాంతారత్న మింతిదనుక రుక్మిణికంటెఁ దన్నధికఁగాఁ జేయుమని వేఁడి యీసమయమున రుక్మిణితో సమానగ నుండినఁజాలుననుచున్నది. కాని స్త్రీ సామాన్యంబునకు సుఃఖము నిర్హేతుకముగా వచ్చును. పాపము నాకు జాలి వేయుచున్నది. దీనినూరార్చెద.

కృ—(ప్రకాశముగా)

తే. గీ. అణిముత్యాల చేరుల నవఘళించు
తేటకన్నీటిసోనలు తెలిపియిడక
యొడదఁ దళుకొత్తుజిలుగుపయ్యెదను దడుప
నేలవగచెద వెలనాఁగ బేలవగుచు?

దేవీ! యూఱడిల్లుము; పారిజాతము దెచ్చెదను.

సత్య—దేవా నాపై నిజముగా ననుగ్రహము వచ్చినదా నమస్కారము.

కృ—సరేగాని, అగణితశాఖాలంకృతంబై యింతమహాభారంబుగానున్న యీవృక్షమును నే నొక్కఁడఁ బెల్లగింపఁగలనా?

సత్య—అయ్యో! ప్రాణేశ్వరా! మఱల నొక క్రొత్తయాటంకమును దెచ్చిపెట్టితిరా? పరిహాసముమాని యెట్లయిన కార్యసాఫల్యముఁ జేయుఁడు.

కృ—కార్యసాఫల్యసాధనము మదీయ సామర్థ్యమున నుండినచో నట్లే చేయుదును. భర్త యదికాయాసము నొందుననియైనను వగవక యిట్టి నిర్భరకార్యము నాపైఁ బెట్టుట భావ్యమా? నాజనకసహోదరులైనచో నన్నిట్టిపనికి నియోగింతురా?

సత్య—నిష్ఠురభాషణంబులచే నాడెందమును గుందింపనేల? మీ రీస్వల్ప కార్యంబుచేయలేకున్నచో నెవరుసమ్మఁగలరు. పూర్వకాలఁబునఁగూర్మావతారధారివై మందరగోవర్ధనం బెత్తలేదే? మఱియు శ్వేతవరాహమూర్తివై సముద్రమగ్నవసుంధరోద్ధరణప్రమోదివి కాలేదా!

కృ—ఏతత్కార్యనిర్వహణార్థమై యవతారంబుల నెత్తితిని. ఇప్పుడు కేవల మనుష్యమాత్రుఁడనుగదా? మనుష్యున కట్టిసామర్థ్యంబు గలుగునా?

సత్య—భక్తజనాధారంబగు నీయవతారంబున మాత్ర మట్టికార్యములఁ జేయ లేదా? నాఁడు నాకలోకాధీశ్వరుం డగుసంక్రందనుఁడు రాళ్లవాన గురియింప సకల గోగోపజన సంరక్షణార్థమై గోవర్ధనధరాధరేంద్రంబు కందుకంబు చందంబున నీ కరారవిందమున గోపబృందంబులు డెందమున నానందింప నెత్తలేదా!

కృ—ప్రాణేశ్వరీ! చక్కని వాక్యజ్ఞప్తికిఁ దెచ్చితివి; నాఁటిమహాసామర్థ్యంబు నేఁడు తెచ్చుకొని యీపారిజాతంబు పెల్లగించెద.

సత్య—ఇంక మనము నిరభ్యంతరముగా దీనినిఁ దీసికొనిపోవచ్చును.

[తెరలో]

ఓహో యెవ రాపారిజాతవృక్ష సమీపమున? మా మహేంద్రునాజ్ఞఁ గొనక యెవ్వరును దానిం జేరఁగూడదు.

కృ—ఇంక నీవృక్షము దరిఁ జేరఁగూడదు. దేవీ! యేమయినను గానిమ్ము. ద్వారకానగరమున కరిగెదము. సంక్రందన సేవకుఁడగు గంధర్వుఁడరుచుచున్నాఁడు.

సత్య—మందభాగ్యురాల నగునా కోర్కెయు విఘ్నములేకలుగుచున్నవి. దేవా యెట్లయినను సాహసముచేసి నాముద్దుచెల్లింపుము. (అని బతిమాలుచున్నది.)

కృ—సరే! ఓయి! గంధర్వా! నేను ద్వారకానగర వాస్తవ్యుండనగు శ్రీకృష్ణుఁడను. మీసంక్రందనుని యానఁగైకొని యిందు విహరింపుచున్నాము.

సత్య—(కొంచెమాఁగి) మీపలుకుల నాలకించి యాగంధర్వుఁ డిటువచ్చుట లేదు.

కృ—వచ్చిన నేమి? పారిజాతమహీరుహమును భవదీయమందిరోద్యానమధ్యంబున నాఁటెదను. గంధర్వసార్వభౌమసమన్వితుండై సర్వపర్వతారాధి పుఁడగు సుపర్వసార్వభౌముఁడు వచ్చినను వానిని నిర్జించెద. నీడెందమున నాందోళము దక్కి యానందము నొందుచుండుము. ఇదిగో సమూలంబుగా దానిని పెల్లగించెద.

[అని దగ్గఱకుఁ బోవుచున్నాఁడు.]

సత్య—ప్రాణేశ్వరా! జయమగుఁగాక జయమగుఁగాక!

కృ—దేవీ! నీపలుకులవలననే నాకు జయమగును.

సత్య—దేవా! ఈవృక్షమూలమున బంఢిగురివెందతీఁగె లెంత దట్టముగా నల్లుకొని యున్నవో చూడుఁడు.

కృ—దేవీ! ఇదిగోఁ జూచుచున్నాను.

తే. గీ. అన్య లీదేవభూరుహం బపహరింతు
రనుభయమ్మున నమరనాయకుఁడు దీని

బండిగురివెందతీఁగెలఁ బదిలముగను
సంకెలలు వైచి బంధించు సరణిఁ దోఁచు.

మఱియు నో దేవీ!

చ. తడవుగఁ బారిజాత వసుధారుహమీలతికాళిఁగూడి యి
క్కడ నొకతావునం బెరిగెఁ గావునఁ దమ్మొదఁబాయు మిత్రము
న్గడపటిసారి గాటముగఁ గౌఁగిటఁ జేర్చెనునాఁగఁ జూడు మీ
యెడఁ బెనవేసికొన్న యవి యీలత లాతరుమూలముల్ సఖీ! 10

సత్య—అట్టి చిరకాల మిత్రములను వేరుఁజేయుటకుఁ గారణము నే నయితిని గదా యని నామనసు జాలినొందుచున్నది.

కృ—ఓదయామయీ! అట్లయిన మన మీ పాపముఁ జేయవలదు.

సత్య—అతిలోభము చేత నే నిందుఁకొడఁబడుచున్నాను.

కృ—దేవీ! నీవీమహీరుహమునుఁ బడయఁగోరుటచే నిది సర్వవిధముల నిన్ను బోలియున్నయది. ఎట్లనిన,

తే. గీ. వెడఁదకొమ్మలు బాహులు బెడగుఁజూపుఁ
జిగురుటాకులు కెమ్మోవి చెవులుదాల్పఁ
పూవుఁ గుత్తులు పాలిండ్ల పోలుపుదెలుపు
క్రొత్త మొగ్గల చాలు పలుకుదురుపోలు.

(అని తీఁగె లొత్తిగించుచున్నాఁడు.)

[తెరలో]

మాధవా! ఆవృక్షమూలమున నున్న తీఁగెల నిర్మూలింపకుము. అవి దేవేంద్రున కత్యంత ప్రియతనుములు.

సత్య—ఈమార్గుఁడు తానే యీపూవుఁదోఁట కధికారివలెఁ బ్రేలుచున్నాఁడు.

కృ—దేవీ! సేవకాధీనమయిన పదార్థము పోయినచో యజమానుఁ డా సేవకుని దండించును. ఈగంధర్వుఁడు సేవకుఁడు గావున నిట్లనుచున్నాఁడు. సేవకులు యజమాను నాజ్ఞానుసార వర్తనులు గదా! కానీ భయము లేదు. (అనివృక్షమును బెల్లగించును.) అప్పుడు చిత్రగ్రీవుఁ డనుగంధర్వుండు ప్రవేశించును.)

చిత్ర—ఓ జగన్నాధా! సుపర్వసార్వభౌమ సేవకుఁడను. ఈనందనవనపాలకుఁడను. చిత్రగ్రీవుఁడనువాఁడను. మహేంద్రుని యాజ్ఞలేకయు మదీయాభిప్రాయంబు లేకయు నీపారిజాతవృక్షమును నిర్మూలింప నేల? చనువిచ్చి విహరింపుమన్నందుకు నిట్లు సేయుట పాడియగునె?

కృ—మూఢుఁడా! ఈపారిజాతమును ద్వారకానగర స్థిత మదీయోద్యాన వనంబునకుం గొనిపోయెద. జీవనాపేక్ష గలిగియున్నచో నడ్డము రాకుము.

చిత్ర—(కోపముతో) ఏమేమీ? ఈప్రపంచసృష్టి మొదలింతవఱకు నిట్టి విచిత్రంబు గనలేను. సకలలోకాధీశ్వరుండై యష్టదిక్పాలకసేవ్యుండై యపారధైర్య పారావారుండైన మహేంద్రునైన జూచి వెరవక నీయిచ్ఛానుసారముగాఁ బారిజాతమును దీసికొనిపోయెదవా! దాని నక్కడఁ బెట్టి మరికదలుము.

కృ—దాని నక్కడఁ బెట్టను. నిన్నిక్కడ బలిపెట్టెదను. నీచగుణసమన్వితుఁడవగు సేవకుఁడవని కరుణాతరంగిత హృదయుండనై యుపేక్షించినకొలఁదిఁ బ్రేలఁ జొచ్చితివేమి? దిక్పాలసమేతుండైన మీయింద్రుం డొక్కఁడే కాఁడు త్రిదశకోటి నిర్జర గణంబులను దాడిపెట్టినను యాహవదోహలంబున వారి నందఱ నిర్జించెద. పో! యీ వార్త మీ సార్వభౌముఁడైన మహేంద్రునితోఁ జెప్పుకొనుము.

సత్య—మూఢుఁడా! నీవంటి యధముఁ డొక్కఁ డాటంకము చేసిన నాఁగునని వచ్చితివా యేమి?

చిత్ర—ఓకృష్ణా! మాధవీలతాసమేతంబగు నీపారిజాతము మాశచీదేవి కత్యంత ప్రియము. నీవు దీనిని గొంపోయినను నామె తెప్పించుకొనక మానదు.

సత్య—(కోపముతో) నీ నిరర్థక ప్రలాపంబులతోఁ బనియేమి? నాహృదయేశ్వరుండు నాహృదయరంజక స్వభావుండగుటచే నేను సామంతంబు గలిగి దీనిం దెప్పించుకొనుచుంటిని. మీ శచీదేవి త్రిలోకాధీశ్వరుం డగు మహేంద్రుని పట్టమహిషి గాదు. అందుచే సామంతంబుండినచోఁ దనభర్త పరాక్రమముచే నీవృక్షమును దిరిగి తెప్పించుకొను మని చెప్పుము. తనపంతంబును నాపంతంబును నీసారి చూడుమనుము.

చిత్ర—ఏమీ! విష్టపత్రయ పూజ్యురాలగు మాశచీదేవి నే నిందింపుచుంటివిగా యీవాక్యంబు లామె విన్నచో మీప్రాణంబులు మీకు దక్కెడునేమో చూచెదను.

కృ—(కోపముతో) ఓధూర్తవర్తనా! నీశిరఃకర్తనం బిప్పుడే యాచరించెదను. నీప్రాణ సంరక్షణార్థమై దిక్కున్నచో రమ్మనుము.

(అని కత్తి దూసి వేయఁబోవుచున్నాఁడు.)

చిత్ర—మహేంద్రా! శరణుశరణు (అనిపాఱిపోవుచున్నాఁడు.)

సత్య—(నవ్వుచు) ఆర్యపుత్రా! కట్టతెగిపోయిన మహాప్రవాహంబుచందంబున నొక్కపరుగుననే వెన్నిచ్చి పాఱుచున్నాఁడు. ఈతం డిప్పు డెచ్చటికి కరుగును?

కృ—ఈనందనవనాధికారి యగు సంక్రందనుని సమక్షంబున కరిగి తన పరాభవంబు నాయదితి తనూభవున కెఱింగించును.

సత్య—సరే! వాఁ డెట్లయిన నేమి? మన మీపారిజాతమహీరుహంబును గొని ద్వారకానగరంబున కరిగెదము రండు.

కృ—ఓసత్రాజిన్నందనా! నాకస్వామి యెఱుంగకుండ నీ ద్రుమంబుం గొని పోవుట యనుచితము.

మ. అమరేంద్రుం డిది యాలకించి యనిసేయ న్వచ్చువాఁ డంచుఁ దోఁ
చు మదిం బోరఁ దొడంగినం బిరికికృష్ణుం డొక్క మ్రుచ్చట్లు వృ
క్షము నీ దొంగిలిపోయినాఁ డనుచు లోకం బెల్ల నిందించు ని
త్యమునుం గావున నిష్ఠ వీఁకఁ బురుషవ్యాపారము న్సల్పెదన్. 12

సత్య—ఒకవేళ సునాశీరుఁడు సేనలం గూర్చుకొని కయ్యమునకు సిద్ధమైనచో?

కృ—కదనక్షోణికి వచ్చినచో మదీయతీక్ష్ణ నందకకౌక్షేయక ధారలచే నీయక్షయలోక వాసుల క్షతవిక్రములఁ గావించి యొక్కక్షణమున వచ్చి నీకటాక్ష వీక్షణములకుఁ బాత్రుఁడ నయ్యెద.

సత్య—ప్రాణేశ్వరా? ఈత్రివిష్టపవాసు లెల్ల మహాక్రుద్ధులై శ్రద్ధతో యుద్ధ సన్నద్ధు లగుదురు గాఁబోలును. మిక్కిలి జాగరూకతతో నుండవలయును.

కృ—ప్రాణేశ్వరబలపరాక్రమపరిజ్ఞానములేని యోషాజేల! బాలా! యింతభయా క్రాంతవు గానేల? గంధసింధురసదృశబంధురగర్వాంధు జరాసంధుని దర్పహా గతిశిశుపాలాది నరపాలవర్గంబును నాఁడు రుక్మిణీకళ్యాణ సమయమున జగత్ప్ర సిద్ధముగ జయించుట నీవు వినలేదా? మఱియుఁ జక్రశార్ఙ్గనందకకౌమోదకీపాంచజన్య శోభితుం డగునీమగని కెవ్వ రీడు?

సత్య—అవును, ఆమాట నిశ్చయమే. గంగగోవున కాగ్రహము వచ్చిన చంద మున మీకు రాకరాక కోపము వచ్చినచో మీయెదుర నెవరు నిల్వఁగలరు?

కృ—అ ట్లైటేఁగియు నిట్లు జేలతనంబున జాలివడనేల? అయినను సన్న గాలికి సయితము లతలు చలించును గదా! ఆయింద్రకుమారులవలన మనకు భయము లేదు; అదిగో యెవ్వరో వచ్చుచున్నారు. (అని పరికించి చూచి) అదిగో గంధర్వ నాయకుఁ డగుచిత్రరథుఁడు వచ్చుచున్నాఁడు. ప్రాయశః మహేంద్రుఁడు వీని నా యొద్దకు దూతఁగా బంపియుండును.

సత్య—ఆర్యపుత్రా! మహేంద్రుఁడు మనలను జులకనఁగాఁ బోవనీయఁడు. కావునఁ గడుమెలఁకువతో మెలఁగవలయు నని మరల విజ్ఞాపనం బొనర్చు చుంటిని.

కృ—దేవీ! రణమునకుఁ జొచ్చినప్పుడు జయాపజయములు ముందు నిశ్చ యింప నలవిగాదు.

మ. అనిలోఁ గెల్చితి నేని నీవొసఁగు గాఢాలింగనం బంది మ
న్ననమై నీకిలికించి తమ్ములకు నానందించెదన్; దివ్యశ
స్త్రనికాయంబుల వాజిలోఁ దెగిన వీరస్వర్గము న్జారకోం
ధును రంభాపరిరంభజృంభణము గాఁతు న్నీకుఁ గన్నెత్తఁగాన్. 13

సత్య—అమంగళము ప్రతిహతము గుఁగాక! ప్రతిహతమగుఁగాక! కులదేవతలు మిమ్ము రక్షింతురు గాక!

కృ—(నవ్వుచు) దేవీ! మఱచితివా! యేవేల్పులవలన నీవు రక్షణముఁ గోరుచున్నావో యావేల్పులతోడనే మన కిప్పుడు కలహముగదా!

సత్య—అట్లయిన వేల్పులవేల్పు మిమ్ముఁ బ్రోచుఁగాక!

కృ—నేనే వేల్పులవేల్పు నని దివిజు లందఱు నన్నను చున్నారు.

సత్య—అట్లయిన మిమ్మును మీరే రక్షించుకొందురు గాక!

[అప్పుడు చిత్రరథుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

చిత్ర—(తనలో) రాయభారము నడపుటయె కష్టము. అందు మురశాసన బలశాసనులకు దౌత్యము నడపుట కష్టతరము.

చ. విభవమునఁ వేల్పుమ్రాఁకు నరవిందదళాక్షుఁడు సత్యభామకు
న్నగముఁ బ్రియమైనకారణమునన్ శచి కన్నదనంబు దాల్చుటన్
విభవుఁడు పంతము న్నముచిభేదియు సంధి పొసంగ నేని నే
లుడునకుఁ బ్రాంతఁజుట్టములు గానఁ బురందర నందనందనుల్. 14

చిత్ర—అట్టిసంధి నాసందేశమువలననే గావలయును. న న్నిచ్చోటికిఁ బనుచునపుడు మహేంద్రుసమక్షమున దేవగురుఁడగు బృహస్పతి నాతో నిట్లని యానతిచ్చె.

ఆ వె. యాదవేంద్రుఁ గాంచి యాదరంబున మ్రొక్కి
కార్యగతుల నెల్లఁ గలయఁ దెల్పి
మనసు నొవ్వకుండ మనపని చెడకుండ
రాయబార మీవు సేయవలయు.

కావున బృహస్పతివచనప్రకారము సందేశము నిర్వతింపఁ బ్రయత్నించెదను. అదిగో వాసుదేవుఁడు దేవీసమేతుఁడై యున్నవాఁడు. (ప్రకాశముగా) యదుకుంజరున కభివాదము చేయుచున్నాఁడను.

కృ—గంధర్వనాయకునకును స్వాగతము.

సత్య—(తనలో) మన్ననలకు లోపమెన్నఁడు లేదు.

చిత్ర—మహాత్మా! నారదాదులగు సురమునులవల్ల మీమహిమ వినుటయేగాని యిదివఱకుఁ గన్నులార మిమ్ము దర్శింపలేను. ఇప్పుడు ధన్యుఁడ నయితిని.

కృష్ణు—నీపరిచయము నాకును నానందమై యున్నయది. కాని వనము కలసిన సమయ మంత ప్రశస్తమయినది గాదు.

చిత్ర—దేవా! మీకుం జెప్పఁదగినవారు త్రిష్టపత్రయమున లేరు. కాని, నావిన్నప మొకటి మన్నింతువు గాక!

ఉ. వేలుపురాచవారలకు వెన్నునకున్ స్పృగ చెల్లునయ్య యే
కాలమునందును న్వనము, కానము చిత్రిము లింతలేసి యా
నీలగళుండు విన్న నిది నీరజగర్భుఁడు విన్న నవ్వరే
పోలదు పోలదో యనఘ పోరెక పొందు పొసంగ నుండరే.                    16

కృష్ణు—నీతిగర్భితములగు నీయుపదేశము నీప్రభువగు మహేంద్రునకుఁ జేయఁ దగినది యేమనఁగా!

తే. గీ. పారిజాతపుష్పంబుల పాన్పుమీఁద
మేనుఁ జేర్ప నాపూదండ మెడను దాల్ప
తుఱుమునందును జాలఁ గ్రొవ్విరులు దుఱుము
మనసు పడియున్న దెంతో యీమందయాన.                    17

అందుచేత నీముద్దియ ముద్దుచెల్లింపఁ గొండొక కాలంబు పారిజాతము ద్వారకానగరంబునకుం గొంపోయి యాలతాంగి యుద్యానవనంబున నాటఁదలంచి మాకు మహేంద్రునికడ నున్న చనువుపెంపునఁ దెంపొనరించి దీని బెకలించితి నంతియకాని పాకశాసనునితో మాకు వైరకారణము లేదు.

సత్య—(కృష్ణునిచెవి గా) ఆర్యపుత్రా! వృత్తమును మాత్రము విడువకుము.

చిత్ర—దేవా! యిందు నేరము పాకశాసనుని దని గాని, నీయదియనిగాని, నిర్ణయించుటకు నే నెంతవాఁడను? అయిన నాకద్రుమములపై దివిజులకుఁ గల యనురాగ మించుకం జెప్పెద వినుము.

సీ. పవ్వళింపమసుమీ పాకశాసనుగాణి పారిజాతపుఁబాన్పుపైనె గాని
యఱుతఁదాల్పఁడుసుమీ యమరేంద్రతనయుండు నుందారకుసుమదామంబె గాని
తిరుగనొల్లరుసుమీ తేఱగంటివిరిబోండ్లు హరిచందనచ్ఛాయలందె గాని
చేయనొల్లరుసుమీ శివపూజ వజ్రి సంతానభూరుహాలతాంతములఁ గాని
అన్నిటికి నేమిగాని యయ్యమరమాత
చెవి నిడదు సుమీ కల్పపల్లవమె గాని

యొకటి బలశాసనునకు వేఱొకటి శచికి
కడమవారికిఁ గడపుదు కామితములు. 18

కృష్ణు—సరే. నీమాటలవలన పారిజాత మింద్రాణికిఁ గరము ప్రియమని తెలిసినది. అయినను క్షీరసాగరమునం దీతరువులు ప్రభవించినది మొదలు నేఁటివఱకు శచీదేవియే దీనిపుష్పంబుల నుపయోగించుకొనుటం జేసి కొండొకకాలంబు సత్రాజిన్నందన కామహీరుహం బెరవుగా నిచ్చి యామె ముచ్చట తీఱినవెనుక నామె మరల గ్రహింపవచ్చును.

చిత్ర—వాసుదేవా! ఈవృక్షాపహరణవార్త వినినంతన యాశచీదేవి మొగము చిన్నఁబోయె. ఇల్లాలి మొగముఁజూచి పాకశాసనుఁడు చిన్నఁబోయె. అతనిదైన్యంబుఁ గని జేజేలమొగములు చిన్నఁబోయె. వేయేల త్రివిష్టపమంతయు వెలవెలఁ బోవుచున్నయది. ఇప్పుడు పౌలోమి ముద్దు చెల్లింపక యాఖండలుం డేపనికిం జొరఁడు గావున దివిజుల ననుగ్రహింపుము.

సత్య—నగుచువా రున్నప్పు డెన్నిమాఱులైన చిన్నఁబోవచ్చును.

కృష్ణు—(చిఱునగవుతో) ఇందు సత్యభామకో శచీదేవికో చిన్నఁదనము రాకమానదు. అది యట్లుండఁగా,

తే. గీ. పాకవైరికిఁ గల దొక్క పద్మగంధి
యామెయులుకకె తానింత యడలెనేని
వెలఁదు లున్నారు పదియాఱువేలు నాకు
వారికిన్కలకు నే నెంత వడఁక వలయు. 19

చిత్ర—మహారసికుఁడవు, దక్షిణనాయకుఁడవు నగు నీకు విలాసవతుల ప్రణయకలహముఁ దీర్చుటలోఁ గల నెఱజాణతనము మహేంద్రునకు లేకపోవచ్చు దానికేమి? అయ్యాఖండలుండు త్రిలోకాధీశ్వరత్వం బగుట నయ్యింద్రమహిషి యుపేంద్రుఁడవగు నీకును సత్రాజిన్నందనకును మాననీయము గావున నామెమాట చెల్లుట పాడి.

కృష్ణు—అది పాడిగాదు.

ఆ. వె. ఎల్లయపుడు పెద్ద లుల్లసిల్లుచున్న
చిన్నవారిముద్దు చెల్లుటెపుడు
రాకరాక వచ్చు రాచబంధుగుల మ
న్నించి పనుచు టెల్ల మంచిపాడి.

చిత్ర—త్రివిక్రమా! అదితిగర్భజనితులలో నీవు కనిష్ఠుఁడవు. ఆసహస్రాక్షుఁడు జ్యేష్ఠుఁడు. అన్న యనుభవించుదానిని తమ్ముఁ డాస చేయుట ధర్మశాస్త్రవిరుద్ధము.

కృ—ఏమి ! అన్న యనుభవించుదానిఁ దమ్ముఁ డాశింపఁగూడదా ! అట్లయిన,

ఆ. వె. నీవుపలికినట్లు నిర్జరేంద్రునకేను
తమ్ముఁ గట్టుమాట తథ్యమగును
నాకరాజ్యమందు నావంతుభాగంబు
పంచి యడుగు టిపుడు పాడిగాదె ? 21

సత్య—(తనలో) ప్రాణేశ్వరునిపలుకు మిక్కిలి ప్రౌఢముగా నున్నయది.

చిత్ర—(గోపముతో) వాసుదేవా ! ఈజంభాసురపరిపంధి సకలకళ్యాణగుణపరిపూర్ణుం డనియు తేజశ్శాలి యనియు నాదివిష్ణుడవైన నీవును శంకరపంకజాసనులును త్రివిష్టపసామ్రాజ్యమున నతని నభిషిక్తుఁ జేసియు మహాపదవియందు నతని సుప్రతిష్ఠితుఁ గావించి యనంతరము దేవతలు పూర్వదేవగణ దుగ్ధపారావారంబు వారండు మథియింపనందుఁ బ్రభవించిన కల్పవృక్షము మొదలగు ననేకపదార్థంబులను భూమ్యాకాశంబులు సూర్యచంద్రులు సకలనిర్జరగణంబులు సాక్షులుగ నయ్యాఖండలునకిచ్చి నేఁ డేదియో నెపంబున నిచ్చినదాని మఱలఁ గైకొనుటయే యేటిధర్మము ? నీవు, సిరియుఁ గౌస్తుభంబును గైకొని తక్కుఁగలవానిని స్వాయముగా విడుచుకొంటి.

కృ—అవును, గంధర్వా ! అవును. ఇది స్వయంకృతాపరాధమే మాడుదుము.

సీ. పవమానజవమైనఁ బరిహసింపఁగఁజాలు హయము నుచ్చైశ్శ్రవం బతని కిచ్చి
ప్రణుతకళ్యాణలక్షణసులక్షితమైన యైరావతగజేంద్ర మతని కిచ్చి
జిలిబిలిపాటలశిల లైనఁ గరగించు నచ్చరలేమల నతని కిచ్చి
అడిగినకోర్కుల నప్పుడ సమకూర్చు హరిచందనాదుల నతని కిచ్చి
గడుపుకొనుటలేదె కాలమెట్టిటో నేను
కంటినిండ నిదురగాన కుండ
పాముపాన్పుఁ జేసి పక్షిగుఱ్ఱముఁ జేసి
నీరరాశి నాకు నెలవుఁ జేసి. 22

మఱియు క్షీరసాగరవృత్తాంతము నీవు జ్ఞప్తికిఁ దెచ్చితివి. కనుక నీమాట నిజము.

ఆ. వె. పాలసంద్రమందుఁ బ్రభవించె నీమ్రాఁకు
కడలిఁ బుట్టుసిరియుఁ గౌస్తుభంబు
నెవఁడు దాల్చె నతఁడె యీమ్రాఁకు గ్రహింపఁ
దగును గాక యొరుఁడు తగునె చెపుము. 23

చిత్ర—అట్లయిన క్షీరాబ్ధిలోఁ బొడమి యింద్రుని యధీనములో నున్న సమస్త వస్తువుల నీవ గ్రహింపవచ్చును.

కృ—మాకు కావలయునేని అట్లె చేయుదుము.

చిత్ర—మాధవా! నే నింక నీ పలుకులకుఁ బ్రత్యుత్తరముఁ జెప్పనక్కరలేదు. అయిన నీపలుకులు రాజనీతికి సయితము విరుద్ధముగా నున్నయవి.

కృ—అయ్యా! రాజనీతినిగుఱించి యించుక చెప్పెద వినుము.

తే. గీ. తమ్ముఁ డన్న యనక తండ్రి సుతుఁడనక
మేటిపగతుఁ డనక చిరమిత్రుఁ డనక
చేవఁగలవాఁడు బలహీనుఁ జెఱుపఁ జూచుఁ
దలఁప రాజనీతికి నొక్కదారి గలదె?

మఱియు నో దేవదూత!

క. తప మొనరించెడుమునివరుఁ
గపటోపాయమునఁ గూల్చఁగా నింద్రునకే
నృపనీతి దొరకె మును పా
నృపనీతియె నేను గొంత నేర్చికొంటిన్. 25

చిత్ర—ఈమాటలు నిశ్చయముగా మామహేంద్రున కలుక పుట్టించును. అందుచే నీకించుక చెప్పవలసి చెప్పుచున్నాను.

తే. గీ. అతనిఋజుమార్గవర్తనం బతనిశక్తి
యతనివజ్రాయుధమహత్త్వ మతనిచండ
పుష్కలావర్తనీరదంబుల తెఱంగు
నీ వెఱుంగుదో యెఱుఁగవో నీరజాక్ష. 26

కృ—(చిఱునవ్వుతో) అయ్యా! తత్ప్రభావము నే నేమెఱుంగుదును? ఎఱిఁగినవారు కొంద ఱున్నారు చెప్పెద వినుము.

సీ. అలపుష్కలావర్త జలధరంబులశక్తి గోవర్ధనం బనుకొండ యెఱుఁగు
శత్రుమన్మహాత్మైన జంభారిమగఁటిమి పలుమాఱు పోరినబలి యెఱుంగు
కొండల ఱెక్కలఁ, జెండినకులిశంబు మహిమ మించుక గరుత్మంతుఁ డెఱుఁగు
నీవు గొండాడినఋజుమార్గవర్తన వేగన్ను లిచ్చినయోగి యెఱుఁగు
నే నెఱుఁగకున్న ముజ్జగం బెఱుఁగదొక్కొ
పాకశాసను గడితంబు బంటుఁడనము
జంభుఁ గడతేర్చినటు వృత్రుఁ జంపినట్లు
గెలువవచ్చు నాలమునందుఁ గృష్ణు నిపుడు. 27

చిత్ర—మృదువచన గర్భితములైన యీ యుల్లశపునుడువులు మర్మభేదములుగా నున్నయవి. ఈపలుకులు విన్నచో మహేంద్రుఁడు నన్నిట్లనకపోఁడు.

ఆ. వె. పాలుఁగుడుపవచ్చు పడఁతిఁ జంపుటగాదు
గోగణంబుఁ గాచికొనుటగాదు
వేపె వెలందులిండ్ల వెన్న జుఱ్ఱుటగాదు
అమరవిభునితోడి సమర మరయ. 28

కృష్ణ—గంధర్వనాయకా! పలుమాటలేటికి? దేవసభలో నామాటలుగా నిట్లు పలుకుము!

చ. అమరులరత్నరాజునకునై దనుజేంద్రులసేనపైఁ బ్రయు
క్తములగు చక్రశార్ఙ్గములు కాలనశంబున నమ్మహేంద్రుపై
నమరులమూఁకపై నతిభయంకర సంగరమందు సంప్రయు
క్తములగు నేఁ దటంచు మది గాఢవిషాదము నాకుఁ గల్గెడిన్. 29

చిత్ర—అట్లయిన నీవు యుద్ధసన్నద్ధుఁడ వగుటకే నిశ్చయించుకొంటివా?

కృష్ణ—అమరేంద్రుఁడు సంధికిఁ జేరనిపక్షమున నట్లే.

చిత్ర—సంధి యెట్లు?

కృష్ణ—ఈపారిజాతవృక్షము నాకిచ్చుటయె సంధికి వచ్చుట.

చిత్ర—అట్లయిన నీవ్వృక్షమును విడువవని మహేంద్రునితోఁ జెప్పవలసినదేనా?

కృ—నిశ్చయముగా విడువ నని చెప్పుము.

చిత్ర—అట్లయిన నేనిఁకఁ బోయి మహేంద్రునితో నాసందేశార్థము విన్నవించెదను. (తనలో) వాసుదేవుఁడు మహేంద్రునిమాట మన్నింపఁడు గనుక నీయాదవచంద్రునకు పారిజాతము నిచ్చి సంధిఁ జేసికొనుటయె మహేంద్రునకును దేవకోటికిని హితమని తోఁచెదును. అందుచే సంధి గావింపు మని నేనింద్రుని త్వరపెట్టి యిచ్చటికిఁ బంపెదను.

(అని చిత్రరథుఁడు నిష్క్రమించుచున్నాఁడు.)

సత్య—అమ్మయ్యా! ఇప్పటికి పారిజాతభూరుహము నాకుఁ దక్కినదని ధైర్యము గలిగినది.

కృష్ణ—ఎందుచేతఁ గలిగినది?

సత్య—చిత్రరథుని పలుకులకు మీ రిచ్చినయుత్తరంబులును మహేంద్రునకు మీరనిపించిన సందేశంబును నా వీనులకు విందొనరించి నాకిట్టి ధైర్యమును గొల్పినయవి.

కృష్ణ—ఇంతమాత్రముచేత నే మనోరథసిద్ధి యయ్యెనని సంతసింపకుము. బిడౌజుఁ డసాధారణ తేజస్సంపన్నుఁడు.

సత్య—(చిఱునవ్వుతో) ఆతని తేజస్సంతయు నొక్క నిముసముక్రిఁదట మీరు చిత్రరథునియెదుట నగ్గడించినపుడె నే నెఱింగితిని. ఇప్పుడు వేర మీరు కొనియాడ నక్కఱలేదు.

కృష్ణ—మన మనుకొన్నయట్లు మహేంద్రుఁ డల్పతేజస్కుఁడైనను నాతోఁ గలహంబునకు వచ్చువాఁ డతఁ డొక్కఁడే గాఁడు. సప్తజిహ్వ, సమవర్తి, సలిలేశ, పలలాశ, సమీర, కుబేర, ప్రముఖులగు దిక్పాలకులు వేల్పుదొరకు బాసటలై వత్తురు. అప్పుడు విజయము మనకే యగునని యెట్లు నిర్ణయింపఁ గలము ?

సత్య—అట్లయిన యుద్ధము తప్పదా ?

కృ—అదిమాత్ర మెట్లు చెప్పఁగలను ?

సత్య—మీ పలుకులు చిత్రరథముఖంబున విని మహేంద్రుఁడు సంధిచేయు నని తలంచెదను.

కృ—నే నట్లు తలంపను. ఏలయన నీ వ్రూఁకుఁ డెట్టిదని నీవు నన్ను నెంత పురికొల్పుచున్నదానవో శచీదేవియు తన భర్త నంత పురికొల్పుచుండును. భార్యచెవి నిల్లుగట్టుకొని పోరుసేయు మని పోరుచున్నపుడు సంధి పొసంగు టెట్లు ? అదియునుం గాక !

ఆ. వె. మానవంతు లైన మగవారిజగడంబు
లంత మొందవచ్చు నింతనంత
నుపశమిల్లు టరిది యుద్ధంబు గాకుండ
నాఁడుదాని కతన నైనపోరు. 30

సత్య—హృదయేశ్వరా ! మీపలుకులు నా చెవులకుఁ గఠినములుగా నుండినను సత్యమునకు దూరములు గావు

కృ—(నవ్వుచు) కళ్యాణీ ! సత్యభామతో సత్యదూరము లైన పలుకులు పలుకరాదుగదా !

సత్య—అదిగో ! యెవరో వచ్చుచున్నారు.

కృ—(పరికించి చూచి) దేవగురుసమేతుఁడై మహేంద్రుఁడే వచ్చుచున్నాఁడు. ఇతఁడు స్వయముగా వచ్చుటచేత సంధి యగునని తోఁచెడిని.

సత్య—ఆర్యపుత్రా ! నాపితికితనముచేత నే నిట్లనుచుందును. మీరు మఱియొక లాగునఁ జేయరుగాని యీ వ్రూఁకు మనయధీనమున నుండునట్లే సంధిచేయుదురుగాక !

[అప్పుడు బృహస్పతియు నింద్రుఁడును బ్రవేశించుచున్నారు.]

బృహ—(తనలో) యెంతెంతవారైన నొకప్పుడు భ్రమఁ జెందకపోరు.

శా. సత్రాజిత్తనయావిధేయుఁ డయి కంసద్వేషి కాంక్షించె నీ
ధాత్రీజంబు శచీవిధేయుఁ డయి సుత్రాముండు దైత్యారితోఁ
శత్రుత్వంబును బూనె నిర్వురును తేజశ్శాలు లేమన్నఁ గు
పాత్రాపాత్రము లెన్న నేరరుగదా భార్యానుకూలాత్మకుల్. 31

ఇంద్రు—ఆచార్యా! చిత్రరథుని సందేశవిశేషములను వినియున్నారుగదా? ఇపుడు గర్తవ్యమేమి?

ఉ. పోరుదునా హరిం గదిసి పోరితినేనిఁ గృతఘ్నుఁ డీతు నా
సీరుఁడు రక్షకుం డయిన శ్రీహరిఁ దాఁకె నటంద్రు భూజనుల్
పోక యుంటినా యమరభూరుహ మెక్కఁడు గొంచుఁబోవఁ దాఁ
బౌరుషహీనుఁడై కులిశపాణిగణంబుఁ దొలంగె నంద్రహో! 32

బృహ—మహేంద్రా! నీతిశాస్త్రవిశారదుఁడ వగునీవు కర్తవ్యము నన్నడుగవలయునా? పరవారు రాష్ట్రము నాక్రమించునపుడు రాచవారు సలుపుకొనవలసిన పద్ధతి నెఱింగించెద. దానిఁబట్టి కర్తవ్యము నీవే యూహించుకొనుము.

ఆ. వె. పరతులావు నెంచి స్వబలంబు గణియించి
తనకు విజయ మగుట తథ్యమేని
చెలువుపలయు శత్రు శీఘ్రము బ కాకున్న
సంధి చేసికొనుట చాలలగ్గు. 33

ఇంద్రు—ఇప్పుడు మనము వాసుదేవుని గెలువఁ గలమా?

బృహ—అది కలలోనివార్త.

ఇంద్రు—అట్టయిన సంధిచేసికొనుటయే యుక్తమా?

బృహ—కాక మఱేమున్నది?

ఇంద్రు—అట్లయిన వాసుదేవుని సమీపమునకుఁ బోదము రండు!

[అని దగ్గఱకుఁ బోవుచున్నారు.]

కృష్ణు—దేవీ! ప్రస్తుతము పగతురైనను మహేంద్ర బృహస్పతులు మనకు మాననీయులుసుమా!

సత్య—ఉత్తములు పరస్పరవైరమునందును గౌరవము విడిచి పనిసేయరు.

మహే—(సమీపించి) యాదవచంద్ర! విజయతాం. విజయతాం.

బృహ—దానవారాతి ర్జయతు! జయతు!

కృష్ణు—నిర్జరేంద్రనిర్జరాచార్యయోః స్వాగతమ్.

మహే—దేవా !

సీ. జయ దేవకీగర్భ జలధికైరవమిత్ర జయవక్త్రకంజవిశాలనేత్ర
జయమహాపాతక జంబాలమార్తాండ జయ శైలజాధవచాపఖండ
జయనీలనీరదశ్యామలాంగవిలాస జయ మహానిష్పృత్తి శేశయనివాస
జయరమామానసజలజాతమదభృంగ జయమదాసురచమూజయవిభంగ
చరణనిర్గతస్వర్గంగ సాహసంగ
కరధృతరథాంగభీవత మోఘపతంగ
జయజయాండజేంద్రతురంగ జయమురంగ
వేల్పుఁగొంకలఁగొంక మా కెన్నఁడోంగ ! 34

తే. గీ. పిన్నవయ్యును మాకంటెఁ బెద్ద వగుచు
గుణవిహీనుఁడ వయ్యును గుణుఁడ వగుచు
బంధుశూన్యుఁడ వయ్యు సబంధు వగుచు
వెలయు చిత్రస్వభావు ని న్వినుతిఁ జేతు. 35

సత్య—(తనలో) దేవతలు బింకము వదలి వినయము నవలంబించినారు.

కృష్ణ-తే. గీ. నుతికిఁ దగనట్టి మనుజుని నుతి యొనర్పఁ
జెల్లునట వయ్య నీవ శచీవిధేయ

ఇంద్రు—. యవని నవతార మొందినహరివి గాక
మనుజుఁడవె నీవు సత్యభామావిధేయ ? 36

కృష్ణ—అయ్యా ! నేనిప్పుడు స్వర్గమున దొంగనైతినిగనుక నుతి కనర్హుఁడనని చెప్పుచున్నాను.

బృహ—మహేంద్రా ! నీవు క్రొత్తగా నీనాఁడు దొంగవు కాలేదుమాఁడు,

తే. గీ. ప్రామినుకు లెల్ల హరియించు వార్ధిఁ బడిన
దొంగదైత్యుఁ జంపిన ప్రాఁతదొంగ నీవు

ఇంద్రు—పాలకడలికన్నియ మనఃపంకజంబు
దోఁచుకొన్నట్టి యాగజదొంగ వీవు. 37

సత్య—(చిఱునవ్వుతో, రహస్యముగా) ప్రాణేశ్వరా ! వీరు మిమ్ములనుమిక్కిలి చక్కఁగా వర్ణించినారు.

కృష్ణ—అయ్యా! మహేంద్రా! ఓయాచార్యా! మీరు నామాటనే స్థిరపఱచుచున్నారు. అందుచేతఁ ద్రిలోకాధీశ్వరునకు నే నిప్పుడు దండ్యుఁడను.

ఇంద్రు—యాదవేంద్రా ! ఇవి యేటిమాటలు.

తే. గీ. ఎవని దీనాక మెవని దీదివిజవృక్ష
మెవని దీనందనోద్యాన మెవఁడు గురుఁడు

ఎవని దీవెల్పుబలఁగ మీయింద్రుఁ డెవ్వఁ
డన్నియును నీవ నీవార లంద ఱనఘ. 38

బృహ—అచ్యుతా! నీకన్న నన్య మెద్దియులేదు. చూడు.

శా. నీలోన న్ప్రభవించు నీభువనము ల్నీయందె వర్ధిల్లెడున్
నీలోన న్లయమొందు; నుండఁ గలదే నీకన్న నన్యం బికన్
నీలోవారలుగారె యీదివిజులు న్నేను న్సునాసీరుఁడున్
మాలోవాఁడవు గావె నీవు మహితాత్మా దేవకీనందనా! 39

బృహ—నీకు దూషణభూషణతిరస్కారంబులు సమానంబులు. మహేంద్రుని వలన నేరంబులు లేవు, ఉన్నను గావవలయు.

ఇంద్రు—పతితులనైనఁ బరమపావనులఁగా నొనర్చు నీవు నేరములులేని నన్ను గరుణింపఁదగు.

కృ—మహేంద్రా!

చ. సరిసరి! యెంతమాట త్రిదశప్రభునంతటివాని నేనఁటే
కరుణ క్షమించువాఁడఁ గుతుకంబును జెందెను సత్యభామ నీ
మఱఁదలు పారిజాత కుసుమంబులఁ దాలుప నొక్కసారి యీ
తెఱవను గారవించుటకుఁ దెంపొనరించితి కూర్మి పెంపునన్. 40

ఇంద్రు—నీవలన నేరములేదు. పౌలోమియుఁ దన కత్యంత ప్రియమయిన యీమహీరుహ మన్యహస్తగత మయినదని విని, కడుంగడు ఖిన్నమయ్యె.

తే. గీ. విన్నఁదన మెన్నఁ డెఱుఁగని వెలఁదిమోము
విన్నవోవ నామన సెంతో చిన్నవోయె
మీవదినె ముద్దు సెల్లింప మీకడకటు
చిత్రరథు నంపితిని కిన్కచేతఁ గాదు. 41

బృహ—ఈమహేంద్రుని పలుకులు నిశ్చితములు.

కృ—త్రిలోకాధీశ్వరా! నీకిష్టమయ్యెనేని పారిజాతవృక్షమును ద్వారకానగరమునకుం గొంపోయి సత్యభామామందిరోద్యానమున నాటి యొక్క సంవత్సరమైన వెనుక మరల మీవృక్షము మీకనిచెదను.

సత్య—(తనలో) అయ్యో! దీనినొక్క వత్సరముమాత్రమే నాకేళీవనంబున నిలుపుమని ప్రాణేశ్వరుఁడు గోరుచున్నాఁడు. శాశ్వతముగా నుండునట్లు కోరిన బాగుండును.

బృహ—యదుకుంజరా! ఇది మాకు ప్రసాదముకదా!

ఇంద్రు—వాసుదేవా! ఒక్కసంవత్సరమే గాదు.

చ. సురహితముం బొనర్చుటకు క్షుద్రనిశాచరుల న్వధింపఁగా
ధరణితలంబునందు నవతారము దాల్చి యెన్ని నాళ్లు మీ
రురుతరలీల నుండెదరొ యుంచుకొనందగు నన్ని నాళ్ళు నీ
తనువును ద్వారకాపురిని దానవమత్తగజేంద్రసింహమా!

సత్య—(సంతోషముతో) ధన్యురాలను! ధన్యురాలను! ఇది మాకు మహ
ప్రసాదము.

కృ—సాత్రాజిత్రీ! దేవతలు యదుకులము ననుగ్రహించినారు. నీమనోర
సిద్ధికిఁ గారకు లగు నీమహేంద్ర బృహస్పతులకు జోహారు సేయుము.

సత్య—ఇదిగో నమస్కరించుచున్నాను. (అని నమస్కారము సేయుచున్నది.)

ఇంద్రు. & బృహ—కల్యాణమస్తు.

కృ—బృందారకేంద్రా! మీరొనర్చిన యుపకారమునకు నేను కృతజ్ఞుఁ
నయితిని, ఇంకమాకు సెలవొసంగితిరేని ద్వారకానగరంబునకుం బోదుము.

బృహ—ఇందుఁ గృతజ్ఞత కేమున్నది? మేమే మీకు కృతజ్ఞులమై యుంఁ
వలయు, ద్వారకానగరముననుండుమీకు స్వర్గవాసులమగు మేము కడుదవ్వుగనున్న
జేగువ నున్న ట్లెంచుకొనవలయును.

కృ—శరీరములు దూరముననున్నను, హృదయములు సమీపమున నేయుండుఁను

ఇంద్రు—స్వపురమునకుఁబోవఁ గుతూహల మొందుచున్న మిమ్ము మేమే
నిలుపరాదు. మీకు సమస్తమంగళము లగుఁ గాక! మఱియు.

ఉ. బాధ లడంగునట్లు పలుబాసల కబ్బము లల్లి యల్లి నీ
గాథలఁ బాడుచుండెదరు గాక మహీజను లెల్ల నెప్డు వి
ద్యాధర సుందరు ల్కరములందు విపంచులు దాల్చియున్న భో
వీథులం మోయ పాడుచును విందొనరింతురు గాక నీకథల్. 4

కృ—అట్లగుట కిమరపతిభావమే కారణము.

బృహ—మహానుభావు లగు నిందోపేంద్రులకలయికచేత జగముల కనంతక
ల్యాణము లిట్లగుఁ గాత!

తే. గీ. కుంభవృష్టిగ వానలు కురియుఁగాత!
ప్రజలకు సమృద్ధిగా నేల పండుగాత!
నీతిమంతులై చరియింతురుగాత! జనులు!
న్యాయముగ నేలుదురుగాత నవనిన్పులు!

(అందఱు నిష్క్రమించుచున్నారు.)

సంపూర్ణము.

